## 'చందమామ'
### పాఠకులకు ప్రత్యేకప్రశ్నలు:

మీరంతా **"భైరవద్వీపం"** చూసే వుంటారు. అందులో నాయకుడిని యక్షిణీ లోకానికి తీసుకెళ్లిన నలుగురు సూక్ష్మరూపుల్ని ఎలా మరిచిపోగలరు?

1. ఆ నలుగురి పేర్లు ఏమిటి?
2. ఆ నలుగురూ మొదటిసారిగా 'షినిమలీభా' ని చూసినపుడు గులుతెలో మాట్లాడిన మాటలేమిటి? మీరు తెలుగులో వ్రాయాలి.

ఈ రెండు ప్రశ్నలకు సమాధానాలు రాసి, కథానాయకుడు విజయ్‌గా నటించిన బాలకృష్ణ పాత్ర పోషణలో మీకు నచ్చిన అంశాలు పది వాక్యాలకు మించకుండా వ్యాఖ్య రాసి, ఈ సినిమా [illegible] జతపరచి, ఈ నెలాఖరులోగా మాకు పంపాలి. [illegible] సరైన సమాధానాలతో పాటు మంచి వ్యాఖ్య [illegible] ఎన్నికచేసి, చక్కటి బహుమతులు [illegible]

భైరవద్వీపం పోటీ
చందమామ విజయా కంబైన్స్
విజయ - వాహిని
స్టూడియోస్
వడపళని,
మద్రాసు 600 026.



చందమామ విజయా
కంబైన్స్



# భైరవద్వీపం

బి.వెంకట్రామరెడ్డి సింగీతం శ్రీనివాసరావు





# చందమామ

సంస్థాపకుడు : 'చక్రపాణి' సంచాలకుడు : నాగిరెడ్డి




## అనుభవమే ప్రధానం!

మనుషుల బాధలకు కారణం తెలుసుకోవాలన్న ఉదాత్త ఆశయంతో భోగభాగ్యాలనూ, భార్యాబిడ్డలనూ వదిలిపెట్టి, సంవత్సరాల తరబడి దృఢసంకల్పంతో ధ్యానంలో గడిపి, మానవజాతి కల్యాణానికి మార్గం చూపిన మహనీయుడు గౌతమబుద్ధుడు. బుద్ధుడి జన్మదినాన్ని సూచించే బుద్ధపూర్ణిమ మే నెల 21వ తేదీ వస్తున్నది. ఈ సందర్భంగా ఆయన తన శిష్యులకు ఏమని ఉపదేశించాడో చూద్దాం:

"సంప్రదాయానుసారం వస్తున్నది కదా అని ఏ విషయాన్నీ అంగీకరించకండి. ప్రాచీన గ్రంథాలలో ఉన్నంత మాత్రాన ప్రతి విషయం సత్యం కాబోదు. ఎవరో చెప్పారని, ఆ చెప్పినవారు ఎంత గొప్పవారయినా సరే, ఆఖరికి మీ గురువయినా సరే ఆ విషయాన్ని గుడ్డిగా విశ్వసించకండి. ప్రతి విషయాన్నీ మీ హేతుబుద్ధితో, అనుభవజ్ఞానంతో జాగ్రత్తగా తరచి చూసి అంగీకరించండి, లేదా తిరస్కరించండి. ప్రతి విషయానికీ అనుభవమే గీటురాయి కావాలి."

బుద్ధుడు తన శిష్యులకు ఇచ్చిన సలహాలు ప్రతిఒక్కరూ పాటించ తగినవి. మనం ఇతరుల నుంచి విన్నవాటిని, కళ్ళారా చూసిన వాటిని, పుస్తకాలలో చదివిన వాటిని హేతుబుద్ధితో సునిశితంగా పరిశీలించి చూసి నిజానిజాలను, మంచిచెడ్డలను గ్రహించడమే వివేకమవుతుంది. అదే మానవజాతి పురోగతికి దోహదం చేస్తుంది!




సంపుటి: 93 మే '94 సంచిక: 5

విడిప్రతి : 4.00 సంవత్సర చందా : 48.00




మీరు చదువుతున్నారా?

26 సంవత్సరాలకుపైగా
సినీ పరిశ్రమకు
ప్రేక్షక పాఠకులకు మధ్య వారధిగా
నిలిచి, ఇటు పరిశ్రమలోనూ,
అటు ప్రేక్షకులలోనూ
ఉత్తమాభిరుచులను
పెంపొందించడంలో
కృషిచేస్తున్న



ఏకైక మాసపత్రిక

# విజయచిత్ర



వార్తలు - విశేషాలు :

# ఇటలీ : నూతన రిపబ్లిక్



తమను నలభై అయిదు సంవత్సరాలుగా పాలిస్తూన్న క్రిస్టియన్ డెమొక్రాట్లనూ, వాళ్ళ వామపక్ష మిత్రులనూ కొంతకాలం మరిచి వుందామని ఇటలీ ప్రజలు నిర్ణయించినట్టు తోస్తున్నది. అందుకే వామపక్షేతర పార్టీలకు పాలించే అవకాశం కల్పించారు. గత మార్చ్ 27, 28వ తేదీలలో జరిగిన అతి ముఖ్యమైన ఎన్నికలలో పాలక పక్షమైన 'క్రిస్టియన్ డెమొక్రాట్స్,' దాని మిత్ర వామ పక్షాలకన్నా 'రైట్‌వింగ్' పార్టీలు పార్లమెంటులో ఎక్కువ స్థానాలను గెలుచుకున్నాయి. 'ఫోర్జా ఇటాలియా' పార్టీ అధ్యక్షుడు సిల్వియో బెర్లుస్కోని యుద్ధానంతర 53వ ప్రభుత్వాన్ని త్వరలో ఏర్పాటు చేయనున్నాడు. ఈ ప్రభుత్వం ద్వారా దేశం మళ్ళీ ఫెడరల్ రిపబ్లిక్‌గా మారవచ్చునని భావిస్తున్నారు.

'ఫోర్జా ఇటాలియా' పార్టీకి 155 స్థానాలూ, జియాన్ ఫ్రాంకో ఫిని నాయకత్వంలోని 'నార్తర్న్ అలయెన్స్' పార్టీకి 105 స్థానాలూ, అంబర్టోబోస్సీ నాయకత్వంలోని నార్తర్న్‌లీగ్‌కు 106 స్థానాలూ లభించాయి. ఈ మూడు కూడా రైటిస్ట్ పార్టీలే. ఈ మూడు పార్టీలూ కలవడంతో, 630 స్థానాలు గల పార్లమెంటు దిగువ సభలో 58 శాతం – అంటే ప్రభుత్వం ఏర్పాటుకు కావలసిన మెజారిటీ లభించింది. కమ్యూనిస్టులకూ వాళ్ళ మిత్ర పక్షాలకూ 34 శాతం స్థానాలు మాత్రమే లభించాయి.

ఫెడరల్ విధానాన్ని మళ్ళీ ప్రవేశపెట్టడానికి అనుకూలంగా రాజ్యాంగ శాసనంలో మార్పులు తీసుకురావడానికీ, ఆ మార్పులను అంగీకారం కోసం ప్రజల ముందు ఉంచడానికీ, అధికారం చేపట్టిన మూడు పార్టీలూ నిర్ణయించాయి. ఈ ఫెడరల్ విధానంలో ప్రెసిడెంటును ప్రజలు ఎన్నుకుంటారు. ప్రధానమంత్రిని పార్లమెంటు నిర్ణయిస్తుంది.

ఇటలీ ఒక వైపున అడ్రియాటిక్ సముద్రం, మరొకవైపున అయోనియన్ సముద్రం, మూడో వైపున మధ్యధరా సముద్రం గల ఒక ద్వీపకల్ప దేశం. ఆ సముద్రాలలోని సిసిలీ, సార్డీనియా వంటి దీవులు కూడా ఇటలీకి చెందినవే. క్రీ.పూ. 510 నుంచి 27 వరకు ఈ దేశాన్ని రోమన్ రిపబ్లిక్ పాలించినట్టు చరిత్ర చెబుతున్నది. క్రీ.పూ. 27 నుంచి క్రీ.శ. 476 వరకు వెలసిన రోమన్ సామ్రాజ్యానికి జూలియస్ సీజర్ పునాదులు వేశాడు.

రోమను సామ్రాజ్య పతనానంతరం ఇటలీ పలు దురాక్రమణదారుల దాడికి గురయింది. ఇటలీలోని అత్యధిక భాగం 16 - 18 శతాబ్దాల మధ్యకాలంలో స్పెయిన్ అధికారంలోకి వచ్చింది.

ఆ తరవాత పాలనాధికారం, ఆస్ట్రియా వశంలోకీ అటుపిమ్మట ఫ్రాన్స్‌కూ లభించింది. ఫ్రాన్స్ చక్రవర్తి నెపోలియన్ వాటర్‌లూ యుద్ధంలో (1815) ఓడిపోయాక ఇటలీలో స్వాతంత్ర్యం కోసం, సమైక్యత కోసం ఉద్యమం బయలుదేరింది. ఆ ఉద్యమం 1870వ సం॥లో విజయవంతమయింది.

మొదటి ప్రపంచ యుద్ధానంతరం (1914 – 18) బెనీటో ముసోలినీ ఇటలీలో 'ఫాసిజం' అనే జాత్యహంకార ఉద్యమాన్ని లేవనెత్తి మూడేళ్ళలో ప్రధాన మంత్రి పదవి చేపట్టాడు. అతడు నియంతలా దేశాన్ని పాలిస్తూ, జర్మనీ నియంత హిట్లర్‌తో చేతులు కలిపి, రెండవ ప్రపంచ యుద్ధానికి దారి చూపాడు. 1943వ సం॥లో పదవీచ్యుతుడై, దేశం వదిలి పారిపోతూండగా చంపబడ్డాడు.

1946వ సం॥లో ఇటలీ రిపబ్లిక్ అయింది. అయినప్పటికీ దేశం ఆర్థిక సమస్యలకు లోనై ఉండడంవల్ల, నిర్వహణ రాజకీయ రంగాలలో తీవ్రమైన అస్థిరత చోటుచేసుకున్నది. ఆ కారణంగా 45 సంవత్సరాలలో 52 ప్రభుత్వాలు మారాయి. కొన్ని ప్రభుత్వాలు కొన్ని రోజులలోనే అంతమైపోయాయి.

ఇటీవలి కాలంలో పాలకపక్షాలు, ప్రతిపక్షాలతో సైతం చేతులు కలిపి వాటికి కూడా ప్రభుత్వంలో వాటా కల్పించడంతో పరిస్థితి మరింత క్లిష్టమయింది. పర్యవసానంగా లంచగొండితనం, అవినీతి అమితంగా ప్రబలిపోయాయి. అధికారంలోని పలువురు నాయకులు ప్రజల నిరసనకూ ఆగ్రహానికీ గురయ్యారు.




ఈ నేపథ్యంలో జరిగిన ఎన్నికలలో ప్రజలు మార్పుకోరి రైటిస్ట్ పార్టీలకు అధికారం అప్పగించారు. ప్రధాన పార్టీ అయిన 'ఫోర్జా ఇటాలియా' స్థాపించిమూడునెలలుమాత్రమే అయింది. ఆ పార్టీ నాయకుడు 57 సంవత్సరాల బెర్లుస్కొనీ పెద్ద టీవీ నెట్‌వర్క్ అధినేత. యూరపులో పేరు ప్రఖ్యాతులు గల అతి పెద్ద ప్రచురణా సంస్థ ఆయనకు సొంతం. ఈనాడు ప్రపంచంలోని సంపన్నులలో చాలా ముఖ్యుడు బెర్లుస్కొనీ. అందుకే ప్రజలు ఆయన్ని ఈనాటి 'సీజర్'గా చెప్పుకోవడంలో ఆశ్చర్యం లేదు.



# జగన్నాథుడి శిష్యరికం

సీతాపురంలోని విశ్వనాధుడికి ముగ్గురు కొడుకులు. పెద్దవాడు వ్యవసాయం చేస్తు న్నాడు. రెండోవాడు వ్యాపారం చూస్తున్నాడు. చివరివాడైన జగన్నాథుడు ఇంటిపట్టున వుండకపోవడం తండ్రికి కొంత బాధగా ఉండేది.

జగన్నాథుడు కానిపనులేమీ చేసేవాడు కాదు. ఎవరింట్లో శుభకార్యం జరిగినా తానే ముందుండి తంతు నడిపించేవాడు. పది మంది మనుషుల్ని వాడికిస్తే, వాళ్ళ మనసు నొప్పించకుండా అందరికంటే ఎక్కువగా వాళ్ళ నుంచి పని రాబట్టేవాడు. పిసినిగొట్టు చేత చందాలిప్పించేవాడు, కఠిన హృదయుడి చేతకళ్ళనీళ్ళుపెట్టించేవాడు. అందువల్ల జగ న్నాథుడు గొప్ప వ్యవహారజ్ఞుడని అంతా అనేవారు.

ఆ ఊళ్ళోనే విశ్వనాధుడి బంధువొకాయన, వాడికి తన కూతురు విశాలాక్షి నిచ్చి పెళ్ళి చేస్తానంటూ వచ్చాడు. విశ్వనాధుడు ఆయ నతో, "నా కొడుకు ప్రయోజకుడయ్యే దాకా పెళ్ళి చెయ్యను. అలా కాకుంటే రేపు వాడి పెళ్ళాం బాధ్యత కూడా నాదే అవుతుంది," అన్నాడు.

"నీకు తెలియడంలేదు. నీ కొడుకు గొప్ప వ్యవహారజ్ఞుడు. వాడిని వేదవనంలోని శ్రద్ధా నందుడి వద్దకు పంపు. చక్కని శిక్షణ లభి స్తుంది. తప్పక రాజుగారి కొలువులో ఉద్యోగం సంపాయించుకుంటాడు," అన్నాడు బంధువు.

శ్రద్ధానందుడి పేరు విశ్వనాధుడూ విని వున్నాడు. అయితే, ఆయన అందరినీ తన వద్ద శిష్యులుగా చేర్చుకోడు. కొందరాయన పెట్టిన పరీక్షలలో నెగ్గాలి. కొందరు దండిగా డబ్బివ్వాలి. అలా చేరిన శిష్యులలో కొందరు రెండు మూడు సంవత్సరాల్లో రాజుగారి కొలువులో ఉద్యోగం సంపాయించుకున్నారు. కొందరు పది సంవత్సరాల నుంచీ ఆయన

జొన్నలగడ్డ రామలక్ష్మి



వద్దనే శిష్యరికం చేస్తూ వుండిపోయారు. మనుషుల చేత పనులెలా చేయించాలో, మంచి మాటలతో మనుషులనెలా ఆకర్షించాలో, చతురోపాయాలను సక్రమంగా ఎలా ఉపయోగించాలో ఆయన నేర్పుతాడు.

బంధువు చెప్పాక, తన కొడుకును కూడా వేదవనం పంపాలని నిర్ణయించాడు విశ్వనాధుడు. ఆయన తనే ముందుగా వేదవనం వెళ్ళి, శ్రద్ధానందుణ్ణి కలుసుకుని జగన్నాధుణ్ణి గురించి వివరంగా చెప్పాడు.

"నువ్వు చెప్పిందాన్ని బట్టి నీ కొడుకు గొప్ప వ్యవహారజ్ఞుడని తోస్తున్నది. అయినప్పటికీ నా పరీక్ష నేను చేయాలి. అందులో నెగ్గాడా సరేసరి! లేదా నువ్వు నాకు ప్రతి ఏటా రెండువేల వరహాల చొప్పున డబ్బు కట్టాలి. చదువు పూర్తి కావడానికెన్ని సంవత్సరాలు పడుతుందీ అన్నది, నీ కొడుకు సామర్థ్యంమీద ఆధారపడి వుంటుంది," అన్నాడు శ్రద్ధానందుడు.

విశ్వనాధుడాయనకు వెంటనే రెండువేల వరహాలిచ్చుకుని, "అయ్యా! జగన్నాధుడిని తమరు ఏ పరీక్షా లేకుండా స్వీకరించండి. ఏటా నేను తమకు రెండువేల వరహాల చొప్పున ఇచ్చుకోగలను," అని సీతాపురానికి తిరిగివెళ్ళి, కొడుక్కు జరిగిందంతా చెప్పాడు.

జగన్నాధుడు అయిష్టంగానే వేదవనం వెళ్ళి శ్రద్ధానందుణ్ణి కలుసుకుని, "గురువర్యా! నేను నా తండ్రి డబ్బుతో కాక నా సామర్థ్యంతో తమకు శిష్యుడిని కావాలనుకుంటున్నాను. తమరు నన్ను పరీక్షించవలసిందిగా కోరుతున్నాను," అన్నాడు.

"నిన్ను పరీక్షించడానికి నాకే అభ్యంతరమూ లేదు. అయితే నాకు నీ తండ్రితో, నీ విషయంలో ఒక ఒప్పందం అయిపోయింది. పరీక్షలో నువ్వు నెగ్గినా సరే, ఆ ఒప్పందం నువ్వు పాటించి తీరాల్సిందే!" అన్నాడు.

ఇందుకు జగన్నాధుడు ఒప్పుకున్నాడు. శ్రద్ధానందుడు వాణ్ణి రకరకాల ప్రశ్నలు వేసి సమాధానాలు రాబట్టి, "నా శిష్యుడుగా నువ్వు నాకు చాలా పేరు తెస్తావు. నువ్వు చాలా గొప్పవాడివి కావడానికి ఎంతోకాలం పట్టదు," అన్నాడు.

ఇందుకు జగన్నాథుడెంతో సంతోషించి వెంటనే ఆయనవద్ద శిష్యుడుగా చేరాడు.

అలా ఆరు మాసాలు గడిచాయి. వేద వనంలో శ్రద్ధానందుడికి చాలామంది శిష్యులున్నారు.

జగన్నాథుడు త్వరలోనే వారందరికీ తలలో నాలుకగా వుంటూ అభిమానపాత్రుడయ్యాడు. వారిలో మేధకుడనే వాడితో జగన్నాథుడికి ఎక్కువ స్నేహమయింది.

మేధకుడికి, జగన్నాథుడి తెలివితేటలు చూసి ఆశ్చర్యంగా వుండేది. "నీకిన్ని విశేషాలు తెలియడం చిత్రంగా వుంది. ఇవన్నీ గురువు నీకు ఎప్పుడు చెబుతున్నాడు?" అని అడుగుతుండేవాడు.

"నేను చెప్పేవన్నీ ప్రపంచజ్ఞానానికి సంబంధించినవి. ఇవి నేను గురువు నుంచి నేర్చుకోలేదు," అని జగన్నాథుడంటే మేధకుడు నమ్మేవాడు కాదు.

మేధకుడి తండ్రి శ్రద్ధానందుడికి ఏటా ఐదు వందల వరహాలు మాత్రమే ఇవ్వడానికి ఒప్పందం చేసుకున్నాడు. డబ్బు తక్కువని గురువు తన విషయంలో పక్షపాతం చూపిస్తున్నాడని వాడి అనుమానం.

ఇలాంటి అనుమానం అక్కడ చాలా మంది శిష్యులలో వున్నట్టు జగన్నాథుడు గుర్తించాడు. ఏమాత్రం డబ్బివ్వని వారిలో అయితే, ఆ అనుమానం ఇంకా ఎక్కువగా వున్నది.



దీనికి తగ్గట్టే శ్రద్ధానంధుడు చెప్పే పాఠాల్లో ఎక్కడా వ్యవహారజ్ఞానానికి సంబంధించిన ప్రసక్తి వుండేది కాదు.

ఆయన చిత్రాసనం మీద కూర్చుని, పర్వతాలెలా ఎక్కాలో, మల్లయుద్ధమెలా చేయాలో, నీటిలో ఎలా ఈదాలో వివరంగా చెప్పేవాడు. ఆయనకు పర్వతాల స్వరూప స్వభావాలు, మానవ శరీర నిర్మాణం, జల ప్రవాహ లక్షణాలు వగైరా గురించి క్షుణ్ణంగా తెలుసు. అయితే శ్రద్ధానందుడు ఆశ్రమం విడిచి ఎక్కువగా ఎక్కడకూ వెళ్ళేవాడు కాదు. ఎక్కువ దూరం నడిస్తే, తనకు కాళ్ళునొప్పి పుడతాయట.

ఒళ్ళు వంచి పనిచేస్తే అదొక రకం బాధ కలుగుతుందని, ఆయన మల్లయుద్ధం



గురించి చేతలతో కాక మాటలతోనే చెప్పే వాడు. తనకు జలగండమున్నదని ఆయన నదికి వెళ్ళేవాడు కాదు. శిష్యులు బావి నీరు తోడిఇస్తే స్నానం చేసేవాడు.

అలాంటి గురువు నుంచి తాను నేర్చు కునేదేమిటా అని, జగన్నాథుడు తరచుగా మథనపడుతూండేవాడు. ఈలోగా గురువు వాడికి వంటల గురించి పాఠాలు మొదలు పెట్టాడు. ఏయే దినుసుల్లో ఎలాంటి గుణ దోషాలున్నవీ వివరించి, ఒకే దినుసుతో రక రకాల రుచులు వచ్చే వంటకాల గురించి అయన వర్ణిస్తూంటే శిష్యులందరికీ నోళ్లూరి పోయేవి. కానీ ఆశ్రమంలో అంతా కంద మూలాలే తినాలి తప్ప వంటలు నిషిద్ధం.

అలా ఏడాది గడిచాక శ్రద్ధానందుడు మళ్ళీ పాత పాఠాలే మొదలుపెట్టాడు. ఈలోగా రాజధాని నుంచి ప్రద్యుమ్నుడనేవాడు శ్రద్ధా నందుడి నాహ్వానించాడు.

ప్రద్యుమ్నుడు శ్రద్ధానందుడి శిష్యుడు. ఏడాది శిష్యరికం చేశాక, వాడు రాజు కొలు వులో చేరి మంచి పేరు తెచ్చుకున్నాడు. వాడి సామర్థ్యానికి మెచ్చుకుని రాజు ఘనసన్మానం చేయబోతున్నాడు. ప్రద్యుమ్నుడు తన గురువు నాహ్వానించాడు. ఆయన శిష్యసమేతంగా అక్కడికి వెళ్ళాడు. అక్కడ పెద్ద సభ ఏర్పా టయింది.

రాజు, ప్రద్యుమ్నుడికి పదివేల వరహాలు కానుకగా ఇచ్చి, వాడి గౌరవార్థం కవుల చేత పద్యాలు చదివించి, రాజనర్తకి నాట్యప్రదర్శన ఏర్పాటుచేశాడు.

సన్మాన సమయంలో ప్రద్యుమ్నుడు, గురు వును వేదిక మీదికి ఆహ్వానించి పాదాభి వందనం చేసి, ఈరోజు నేనింతటి వాడిని కావడానికి కారణం నా గురువుగారేనని రాజుకూ, సభికులకూ చెప్పాడు.

అందుకు సమాధానంగా శ్రద్ధానందుడు, "నా శిష్యుడు నావద్ద చేరిన రోజునే నేన న్నాను, నువ్వు త్వరలోనే గొప్పవాడివైపోయి నాకు పేరు తెస్తావని! ఇలా జరుగుతుందని నాకు ముందే తెలిసినా, నా మాట నిజం కావడం నాకిప్పుడెంతో సంతోషంగా వుంది," అని శిష్యుణ్ణి మెచ్చుకున్నాడు.

ఇది వింటూ జగన్నాథుడెంతో సంబర పడి, "నేను చేరినప్పుడు గురువుగారు, నా గురించి కూడా ఇలాగే అన్నారు. అంటే, నేనూ త్వరలో గొప్పవాణ్ణి కాగలనన్న మాట!" అన్నాడు సంతోషంగా, తన పక్కనే వున్న మేధకుడితో.

మేధకుడు పెదవి విరిచి, "అలా అనడం గురువుగారి అలవాటు. నా గురించీ మొదట్లో అలాగే అన్నాడు. ఇప్పటికి నేను చేరి ఆరేళ్ళు కావస్తున్నది. ఇంకా నా విద్యాభ్యాసం ఎన్నాళ్ళో తెలియదు. ఈ ప్రద్యుమ్నుడు తెలివైనవాడు కాబట్టి, ఏడాది కాగానే ఈ గురువు దగ్గర నేర్చుకునేదేముందిలే అని బయటకు పోయి పేరు తెచ్చుకున్నాడు. చూసిచూసి నేనా పని చేయలేకపోతున్నాను!" అన్నాడు.

ఈ మాటలు జగన్నాథుడిని బాగా కలవర పరిచాయి. ఆ రాత్రంతా రకరకాల ఆలోచ నలతో వాడికి నిద్రపట్టలేదు.

మర్నాడు రాజు, శ్రద్ధానందుడి వద్దకు వచ్చి, "నా కొలువులో కోశాధికారికి సహాయ కుడి పదవి ఖాళీగా వుంది. తమ శిష్యులెవ రైనా వుంటే సూచించగలరు," అని కోరాడు.

శ్రద్ధానందుడు ప్రశ్నార్థకంగా శిష్యుల వంక చూశాడు. జగన్నాథుడు చటుక్కున లేచి, "నా శిష్యరికం పూర్తయిందే అనుకుంటు న్నాను. మా గురువుగారు అనుమతిస్తే, ఈ పదవిలో నేను చేరగలను," అన్నాడు.

శ్రద్ధానందుడు, జగన్నాథుడిని దీవించి, "త్వరలో నీకూ సన్మానం జరుగుతుంది. అప్పుడు నీ గురువును మరిచిపోకు!" అన్నాడు.



జగన్నాధుడు, గురువుకు పాదాభివందనం చేశాడు.

తర్వాత మేధకుడు, జగన్నాధుడిని ఒంటరిగా కలుసుకుని, "మన గురువు పక్షపాత బుద్ధి చూశావు గదా! నీ తండ్రి రెండువేల వరహాలిచ్చాడని, ఏడాదిలో నిన్ను రాజు కొలువులో ప్రవేశపెట్టాడు. ఆ కృతజ్ఞతకొద్దీ నువ్వాయనను గుర్తుంచుకుంటావు. ఈ విధంగా ఆయన కలకాలం గొప్ప గురువుగా చలామణీ అయిపోతాడు. మావంటి అమాయకులింకా ఆయనవద్ద శిష్యులుగా చేరి జీతం బత్తెం లేని సేవలు చేస్తుంటారు," అని బాధపడ్డాడు.

జగన్నాధుడు, మేధకుడి భుజం తట్టి, "నువ్వు పొరబడుతున్నావు. ఎందుకంటే, ఆయన శిష్యులందరికీ ఒకేవిధంగా పాఠాలు చెబుతాడు. ఆయన చెప్పే పాఠాల్లోనే గొప్ప రహస్యముంది. పుస్తకాల నుంచి ఎంత తెలుసుకున్నా అనుభవంలోకి రానిదే పర్వతాలెక్కలేము, యుద్ధాలు చేయ్యలేము, నీటిలో ఈదలేము, రుచుల నర్థం చేసుకోలేము. జీవితంలో దేనికైనా అనుభవం ముఖ్యం. అది మనం గ్రహించకుండా ఆయన పాఠాలు విన్నంతకాలం, మన శిష్యరికం పూర్తి కానట్టే లెక్క! ఈ విషయం తొందరగా గ్రహించిన ప్రద్యుమ్నుడి వంటివారు ఆయనను విడిచి పెట్టాక, జీవితంతో ప్రతి విషయంలోనూ అనుభవానికి ప్రాధాన్యతనిస్తూ ఎన్నో నేర్చుకుంటున్నారు, పేరు తెచ్చుకుంటున్నారు. ఏడాది కాగానే గురువు పాత పాఠాలు తిరిగి మొదలుపెట్టడం మనకు హెచ్చరిక! మీ చదువైపోయింది, అది మీరు తెలుసుకోండి, అని! వ్యవహారజ్ఞుడిలాంటి సూచనల నుంచే ముఖ్య విషయం గుర్తించాలి!" అన్నాడు.

మేధకుడిది విని, జగన్నాధుడి సునిశిత బుద్ధిని మెచ్చుకుని, "తప్పు నాదే కానీ, గురువుది కాదని అర్థమయింది. ఈ జ్ఞానంతో గురువుగారికి మరికొంత కాలం శుశ్రూష చేసి, నేనూ బయటి ప్రపంచంలోకి వచ్చేస్తాను," అని వెళ్ళిపోయాడు.

జగన్నాధుడు, రాజు కొలువులో చేరి విశాలాక్షిని పెళ్ళి చేసుకుని, తన సమర్థతతో సన్మానాలు పొందుతూ, గురువుకూ కీర్తి తెచ్చాడు.





# కీర్తిసింహుడి కథ

పూర్వం కోసలదేశాన్ని సుషేణుడనే మహారాజు పరిపాలిస్తుండేవాడు. అయనకు జయసేనుడనే ఆప్తమిత్రుడొకడున్నాడు. జయసేనుడు రాజుకు కేవలం మిత్రుడే కాక, ఆంతరంగిక సలహాదారు కూడా. చదరంగ ప్రియుడైన రాజు, తనతో సమఉజ్జీ అయిన జయసేనుడితో తరుచు చదరంగం ఆడుతూండేవాడు.

ఒకసారి రాజుతో చదరంగం ఆడి గెలిచిన జయసేనుడు నవ్వుతూ, "ఏమిటో సృష్టి వైచిత్రి! మహారాజులైన తమను ఓడించినప్పటి, ఈ ఆనందం కంటే, నా కుమార్తె చేతిలో ఓడినప్పటి ఆనందం, వెయ్యి రెట్లు ఎక్కువ!" అన్నాడు.

జయసేనుడి ఏకైక సంతానం శక్తిసేన ఎంతో అందమైనదేగాక, గుణవంతురాలూ, మేధావీ అని అప్పటికే వినివున్న రాజు, ఆ సంగతులేమీ ఎరగనట్టే, "ఏమిటీ, నీకుమార్తెకు చదరంగంలో అంతటి ప్రావీణ్యత వున్నదా?" అని, ఆశ్చర్యం నటిస్తూ అడిగాడు.

"ఆహా! కావలిస్తే తమరు స్వయంగా పరీక్షించవచ్చు," అని పితృగర్వంతో తీవిగా బదులిచ్చాడు జయసేనుడు.

"తప్పకుండా! రేపు రాత్రే నేను మీ ఇంటికి వచ్చి, నీ అతిథి సత్కారమూ, నీ కుమార్తె చదరంగ ప్రావీణ్యమూ ఎంతటిదో చూసి సంతోషిస్తాను," అన్నాడు మహారాజు నవ్వుతూ.

"మహాప్రసాదం!" అన్నాడు జయసేనుడు.

అన్న ప్రకారం మర్నాడే వెళ్ళి, శక్తిసేనతో చదరంగం ఆడాడు మహారాజు.

లక్ష్మీ గాయత్రి



అతి చురుకుగా పావులు కదుపుతూ వచ్చిన శక్తిసేన, అవలీలగా రాజు మూడు ఆటలూ కట్టివేసింది.

శక్తిసేన చురుకుదనానికీ, విజ్ఞానకాంతులు వెదజల్లుతున్న ఆమె సౌందర్యానికీ ముగ్ధుడయ్యాడు మహారాజు.

తర్వాత ఆయన, జయసేనుడి ఆతిథ్యాన్ని స్వీకరిస్తూ, "శక్తిసేన వంటి కుమార్తెకు తండ్రివైనందుకు నిన్ను అభినందిస్తున్నాను, జయసేనా! కాకపోతే, ఆమే పురుషుడై వుంటే, మరింత బాగుండేది!" అన్నాడు చిన్నగా నవ్వుతూ.

ఆ మాటకు జయసేనుడు, "మీ మాట కాదని అంటున్నందుకు మన్నించాలి! శస్త్ర శాస్త్రాల్లో సమాన ప్రావీణ్యత గడించిన నా కుమార్తె కాలి గోటికి కూడా, ఏ పురుషుడూ సరి రాడు! వీరాధివీరులమని చెప్పుకునే, ఎంతమంది పురుషుల కంటే కూడా అధికురాలైన నా కుమార్తె, స్త్రీ అయినందుకే నేను సంతోషిస్తున్నాను," అన్నాడు.

ఆ జవాబుకు రాజు కాస్త పౌరుషం తెచ్చుకుని, "అయితే, నా కుమారుడు కీర్తిసింహుడి కంటే, నీకుమార్తె ఘనురాలంటావు, అవునా?" అని ప్రశ్నించాడు.

ఊహించని ఆ ప్రశ్నకు జయసేనుడు కంగారుపడి, ఏదో అనబోయాడు. అయితే, రాజు అతణ్ణి వారించి, "కంగారుపడవలసిన అవసరం లేదు! నేను నీ కూతురికి ఒక పరీక్ష పెడతాను. ఆమె అందులో నెగ్గిందా, మెచ్చి కోడల్ని చేసుకుంటాను. ఓడిపోయిందా, కూతురుగా అభిమానించి అత్తవారింటికి సాగనంపుతాను. సరేనా?" అన్నాడు.

గత్యంతరం లేని జయసేనుడు, సరేనని అంగీకరించాడు.

"అయితే, ఇక విను! యువరాజు కీర్తిసింహుడు మన దేశానికి ఉత్తరాన వున్న ఆరావళీ పర్వత ప్రాంతంలో గల కృష్ణచంద్రుడి గురుకులంలో విద్యాభ్యాసం చేస్తున్నాడన్న విషయం నీకు తెలిసిందే గదా! కులగురువు మెచ్చిన విద్యార్థి అతడు. రాబోయే పౌర్ణమితో అతడి విద్యాభ్యాసమూ, యువరాజుకు కృష్ణచంద్రుడు ఇచ్చే ప్రత్యేక శిక్షణా పూర్తి అవు

తాయి. కృష్ణపాడ్యమినాడు ఒంటరిగా బయలు దేరి రాజధానికి తిరిగి వస్తున్నాడు. నీ కుమార్తె దారిలోనే అతణ్ణి అటకాయించి, తూర్పున వున్న అడవులవైపు మళ్ళించాలి. ఆ అడవుల్లో పురాతనమైన శక్తి ఆలయం ఒకటి వున్నదన్న సంగతి కూడా నీకు తెలిసిందే! ఆ ఆలయంలో మూడు రోజులపాటు కీర్తిసింహుణ్ణి బంధించి వుంచాలి. ఈ పని నీ కుమార్తె చెయ్యగలిగిందా, నా కోడల్ని చేసుకుంటాను. అయితే, ఒక్క నియమం! ఇదంతా నీ కుమార్తె ఒంటరిగా చెయ్యాలి. ఎవరి సహాయమూ తీసుకోరాదు. యువరాజును ఇంకెటూ మళ్ళించరాదు. ఇంకెక్కడా బంధించరాదు. ఏమంటావు?" అని అడిగాడు రాజు.

అంతా విన్న జయసేనుడికి మతిపోయి నట్టయింది. ఒళ్లు చల్లబడింది.

ఒకటి, రెండు క్షణాలాగి జయసేనుడు చప్పున మహారాజు చేతులు పట్టుకుంటూ, "మహారాజా! పితృగర్వంతో నేనన్న మాటలను ఉపసంహరించుకుంటున్నాను. మమ్మల్ని క్షమించి వదిలిపెట్టండి. ఎంతైనా, ఆడపిల్లను ఇటువంటి పరీక్షకు గురిచెయ్యటం, తమకు భావ్యం కాదు," అని వేడుకున్నాడు.

మహారాజు గంభీరంగా, "అలాగా! ఏదీ, నీ కుమార్తెను ఇలా పిలిపించు!" అన్నాడు.

జయసేనుడు, శక్తిసేనను పిలిచాడు. మహారాజు స్వయంగా ఆమెకు అంతా చెప్పి,



మృదువుగా, "అమ్మా, మీ నాన్నకు పితృగర్వమే కాదు, పితృభీతి కూడా అధికమే! అందుకే నిన్నడుగుతున్నాను; నా ప్రతిపాదన నీకు అంగీకారమేనా?" అని ప్రశ్నించాడు.

శక్తిసేన తలవంచుకుంటూ, "అంగీకారమే!" అన్నది.

కుమార్తె సమాధానం విని జయసేనుడు స్తంభించిపోయాడు. మహారాజు మాత్రం చిరునవ్వు నవ్వుతూ, జయసేనుడి భుజం తట్టి, రాజప్రాసాదానికి వెళ్ళిపోయాడు.

మహారాజు వెళ్ళిపోగానే శక్తిసేన, తండ్రి దగ్గరకు వచ్చి కూర్చుంటూ, "ఇందులో అంత భయపడవలసిందేమీ లేదు, నాన్నా!" అన్నది ఓదార్పుగా.



శక్తిసేన, తండ్రి మాటలకు నిబ్బరంగా, "ఈ విషయాలన్నీ మహారాజుకు తెలిసినవే! అయినా, ఆయన మనకీ కఠినపరీక్ష ఎందుకు పెట్టారంటావు, నాన్నా?" అని ప్రశ్నించింది.

జయసేనుడు మరికాస్త ఆవేశంగా, "ఇం కెందుకు, నేను నిన్ను చూసుకుని అధికంగా పడుతున్న గర్వం వదలగొట్టడానికి, మహారాజు వేసిన ఎత్తు ఇది!" అన్నాడు.

శక్తిసేన నవ్వి, "అభిమానం మనిషి మన సును ఎంత బలహీనపరుస్తుందో, ఎలా పక్క దారులు పట్టిస్తుందో మిమ్మల్ని చూస్తే అర్థ మవుతున్నది, నాన్నా! ప్రతి నీచభావానికీ ఒక ఉత్తమస్థితి వున్నది. విద్యార్థి మరొక మంచి విద్యార్థిని చూసి అసూయపడి, తనూ వాడిలా తయారవాలని పోటీపడడం, ఈర్ష్య, అసూయ అనే నీచ భావాల ఉత్తమస్థితి! అలాగే పితృగర్వమనేది, గర్వభావానికి ఉత్తమ స్థితి! ఇటువంటి ఉత్తమ స్థితుల్ని నశింప జెయ్యాలని చూసేవాడు, అధముడు. మహా రాజు అటువంటి అధముడని, నేననుకోను. ఆయన ప్రతిపాదన వెనుక ఏదో అంతరార్థ మున్నదని, నా ఊహ. కాస్త ఆవేశం తగ్గించు కుని ఆలోచించి చూడండి!" అన్నది.

కూతురు మాటలతో జయసేనుడు ఆవేశ పడుతూ, "అంగీకరించిన తర్వాత, తప్పని సరిగా అనుకోవలసిన మాట, అదేనమ్మా! కాకపోతే, తండ్రిగా నేనామాటలు అనుకోలేక పోతున్నాను. కీర్తిసింహుడు ఎటువంటివాడో, నాకు బాగా తెలుసు. కృష్ణచంద్రుడంతటి గొప్ప గురువుకు ప్రీతిపాత్రుడైన శిష్యుడతను. రాజనీతిలోనే కాదు, లౌకిక వ్యవహారాల్లోనూ, యుద్ధ విద్యల్లోనూ కూడా అతడికి సాటి ఎవ్వరూ లేరు. అటువంటి వ్యక్తిని మోసపుచ్చి, అరణ్య మధ్యంలో ఎక్కడికో తీసుకువెళ్ళి బంధించటానికి — అదీ ఒక్కతివే ఒంటరిగా! ఇందుకు ఒప్పుకున్నావంటే ఏమనాలి?" అన్నాడు.

కూతురు మాటలకు తెల్లబోయిన జయ సేనుడు, "నిజమే! మహారాజు, అంతటి అధ ముడు కాడు, అంతటి అధముడు కాడు," అని గొణుక్కుంటూ, మైకం వదలినవాడిలా తల విదిలించి, ఆలోచనలో పడ్డాడు.

కొద్దిసేపటి తర్వాత, జయసేనుడు తలెత్తి, కూతురును అప్యాయంగా చూస్తూ, "తొందర పాటు నుంచి నన్ను కాపాడావు, తల్లీ!" అని నిట్టూర్చి, "ఇంతకూ మన ఊహ నిజం అయే పక్షంలో, నీకు చాలా విషయాలు చెప్పాలి. చెబుతాను, శ్రద్ధగా విను," అంటూ ప్రారంభించి, ఇలా చెప్పసాగాడు:

ప్రస్తుతపు రాజు సుషేణుడికీ, మనకూ వున్న మిత్రత్వం ఈనాటిది కాదు! తరతరాలుగా మన కుటుంబీకులు, కోసల రాజులకు ఆప్తమిత్రులుగానూ, ఆంతరంగిక సలహాదారులుగానూ వ్యవహరిస్తున్నారు. దీనికి ప్రారంభం, మా తాతగారి ముత్తాత కాలంలో జరిగింది. ఆయన పేరూ నా పేరే — జయసేనుడు! ఆయన బహువిధ ప్రజ్ఞగలవాడు. ముఖ్యంగా మంత్రవిద్యను కరతలామలకం చేసుకున్న వ్యక్తి. అప్పట్లో ఆయనను మించిన మంత్ర శాస్త్రజ్ఞుడు దేశ దేశాలు వెతికినా కనిపించేవాడు కాదు!

అప్పటి మహారాజు విచిత్రవర్మకు మంత్ర శాస్త్రమంటే ప్రత్యేకాభిమానం వుండేది. ఆయన ఆ విద్యలో కొంత కృషి చేశాడు కూడా. జయసేనుడి మంత్ర విద్యా ప్రావీణ్యత గురించి విన్న విచిత్రవర్మ, కోరి అతడితో మైత్రి చేసుకుని, తన ఆంతరంగిక సలహాదారు పదవిలో నియమించి గౌరవించాడు. సకల శాస్త్ర పారంగతుడూ, ధర్మమూర్తి అయిన మహారాజుతో స్నేహం జయసేనుడికి అమితానందాన్నీ, తృప్తినీ ఇచ్చింది. కొద్ది కాలంలోనే వాళ్ళిద్దరూ ప్రాణ స్నేహితులయ్యారు. మహా





రాజు కోసం, తన ప్రాణం అయినా ఇవ్వ టానికి సిద్ధంగా వుండేవాడు.

జయసేనుడి మంత్రవిద్య సహాయంతో విచిత్రవర్మ, జయసేనులిద్దరూ అదృశ్య రూపంలో రాజ్యంలో సంచరిస్తూ, ప్రజల కష్ట సుఖాలు గమనిస్తూండేవారు. దొంగలనూ, దుర్మార్గులనూ పట్టుకుని శిక్షించేవారు. కష్టా లలో వున్న వాళ్ళను ఆదుకునేవారు.

ఈవిధమైన పాలనలో కోసల సుభిక్షమై, ప్రజలు అంతులేని సుఖ సంతోషాలతో జీవిస్తూండేవారు. దొంగలకూ, దోపిడీదారు లకూ మహారాజంటే సింహస్వప్నంగా వుండేది.

ఇలా వుండగా — ఒకసారి మహారాజు పుట్టినరోజుకు, జయసేనుడు ఒక ముత్యాల హారాన్నిబహుమతిగాఇచ్చాడు. అది మామూలు ముత్యాలహారం కాదు. జయసేనుడి చేతిలో అద్భుతమైన మంత్రశక్తులను నిక్షిప్తం చేసు కుని తయారైన అపురూప హారం! పూర్తిగా మంచి ముత్యాలతో తయారుచెయ్యబడిన ఆ హారానికి, నవరత్న ఖచితమైన పతకం అమర్చబడింది.

స్వర్ణకారుడు మామూలుగా తయారుచేసి ఇచ్చినఆ హారంలో, తన సర్వశక్తులూ వినియో గించి, మూడు అద్భుత శక్తులను నిక్షిప్తం చేశాడు జయసేనుడు. ఆ హారం ధరించిన వ్యక్తి కావాలనుకున్నప్పుడు అదృశ్యంగా సంచ రించగలడు. ఇది మొదటి శక్తి. రెండవది, అతడికి ఎదుటి వ్యక్తి చెబుతున్నది నిజమో, అబద్ధమో తెలుస్తుంది. మూడవదీ, అత్యంత ఆకర్షణీయమైనదీ ఏమంటే, ఆ హారం ధరించిన వ్యక్తికి భూమిలో నిక్షిప్తమై వున్న నిధి నిక్షేపాలు కనిపిస్తాయి. మహారాజు మీద తనకు గల గౌరవం, అభిమానం ఆ పనికి పురికొల్పగా, ఆ హారాన్ని తయారుచేశాడు జయసేనుడు.

జయసేనుడు తనకు బహూకరించిన హారం ప్రాముఖ్యత వినగానే, అతడికి తనపై గల విశ్వాసానికీ, అభిమానానికీ చలించి పోయాడు మహారాజు.

కొన్నాళ్ళు గడిచాయి. ఒకసారి, జయ సేనుడు బహూకరించిన హారం ధరించి, కోసలకు తూర్పున వున్న అడవుల్లో పరివారం

వెంటరాగా వేటకు వెళ్ళాడు, విచిత్రవర్మ. ఏదో అనారోగ్య కారణంగా జయసేనుడు మహారాజుతో పాటు వెళ్ళక, నగరంలోనే వుండి పోయాడు.

పగలంతా అడవిలో వేట సాగించి, రాత్రికి అక్కడే అందరూ, మహారాజుతో పాటు గుడా రాలు వేసుకుని విశ్రమించారు.

కాపలా భటులు తప్ప మిగతా పరిజనం అంతా నిద్రపోయినా, మహారాజుకు మాత్రం నిద్రపట్టలేదు. ఆయనకు ఏదో తెలియని ఆనందం, ఆవేదన కలగసాగాయి. అశాంతిగా గుడారంలోంచి బయటికి వచ్చి, గమ్యం తెలియనివాడిలా అటూ ఇటూ తిరగసాగాడు. మహారాజు వింత చర్యకు విస్తుబోతూ భటులు కూడా, మహారాజును అనుసరించారు.

చివరికి ఒకచోట ఆగిపోయిన విచిత్రవర్మ, తక్షణం అక్కడ తవ్వవలసిందిగా భటులను ఆజ్ఞాపించాడు.

మరికొద్దిసేపట్లో కాగడాల వెలుతురులో, ఆ ప్రదేశం పట్టపగలులా మారింది. తవ్వ కాలు ప్రారంభమయ్యాయి. రాత్రికి రాత్రి ఆ అడవిలో అలా ప్రారంభమైన, ఆ తవ్వకాలు మర్నాటి మధ్యాహ్నం వరకూ నిర్విరామంగా సాగాయి.

ఆ మధ్యాహ్నానికి, ముక్కున వజ్రపు ముక్కెరతో, నిలువెత్తు నల్లని శక్తి విగ్రహం ఒకటి బైటపడింది. మహారాజుకు ఆ విగ్రహాన్ని చూడగానే ఆనందమూ, ఆవేదనా రెట్టింపు అయ్యాయి. తనను తాను నిబ్బరించుకుంటూ, విగ్రహాన్ని తక్షణం రాజధానికి తరలించవల సిందిగా ఆజ్ఞాపించాడు.

కాని, అదృష్టమో, దురదృష్టమో — అక్కడ విచిత్రవర్మతో బాటు వున్న ప్రహ్లాదుడనే మంత్రి, రాజు ప్రయత్నం సాగనివ్వలేదు. ఆగమ శాస్త్రవేత్తలూ, తాంత్రికులూ వచ్చి చూసి చెబితే తప్ప, ఆ విగ్రహాన్ని అక్కడినుంచి కది లించడం ఏమాత్రం మంచిది కాదని సలహా ఇచ్చాడు.

అయిష్టంగానే మంత్రి సలహాను అంగీ కరించిన విచిత్రవర్మ, కొందరు భటులను అక్కడ కాపలాగా నియమించి రాజధానికి ప్రయాణం కట్టాడు. — (ఇంకావుంది)






# చిన్నరాజు - పెద్దరాజు

పట్టువదలని విక్రమార్కుడు చెట్టు వద్దకు తిరిగివెళ్ళి, చెట్టు పైనుంచి శవాన్ని దించి భుజాన వేసుకుని, ఎప్పటిలాగే మౌనంగా శ్మశానం కేసి నడవసాగాడు. అప్పుడు శవంలోని బేతాళుడు, "రాజా, నువ్వేదో ఒక మహత్తర కార్యం సాధించబూని, ఇంత అర్ధరాత్రివేళ భయానకమైన ఈ శ్మశానంలో నానా ఇక్కట్లకూ గురవుతున్నావన్న అనుమానం కలుగుతున్నది. అది నిజమైతే, ఒక్కొక్కసారి కార్యం సానుకూలం కానున్న సమయంలో, ఎంతో జీవితానుభవం,వివేకంగలమేధావులు కూడా, తమ ఆశయానికీ, ధ్యేయానికీ భిన్నంగా ప్రవర్తించి, చేజేతులా శ్రమ ఫలితాన్ని జారవిడుచుకుంటారు. నువ్వు కూడా అలాంటి పొరపాటు చేయకుండా వుండేందుకు హెచ్చరికగా కుముదుడు అనే ఒక మేధావి కథ చెబుతాను, శ్రమ తెలియకుండా, విను," అంటూ ఇలా చెప్పసాగాడు:

## బేతాళ కథలు



ఒకానొకప్పుడు త్రిపురదేశాన్ని సుమంతుడనే రాజు పాలించేవాడు. ఆయన పాలనలో రాజోద్యోగులలో అవినీతి బాగా ప్రబలిపోయింది. అందువల్ల సమర్థులకు రాజు కొలువులో స్థానం లభించేది కాదు. ప్రజలు కట్టే పన్నుల్లో చాలాభాగం అవినీతిపరుల పాలు కావడంతో క్రమంగా కోశాగారం వట్టిపోయింది. రాజు పన్నులు పెంచేవాడు. కొంత కాలం బాగుండేది. మళ్ళీ కోశాగారం వట్టిపోతే, రాజు మళ్ళీ పన్నులు పెంచేవాడు.

త్రిపురదేశంలోని చంద్రావతీ నగరంలో కుముదుడనే మేధావి వున్నాడు. ఆయన తన తెలివితేటలతో ఎటువంటి క్లిష్ట సమస్యనైనా పరిష్కరించగలిగేవాడు. ఆయనచుట్టూ ఎందరో తిరుగుతూండేవారు. దేశంలో కరువు పరిస్థితులు ఏర్పడడంతో, కుముదుణ్ణి దర్శించే వారి సంఖ్య తగ్గిపోయింది. ప్రజలకు అటు రాబడి లేక, ఇట్టే ధరలు, పన్నులు పెరిగి పోతూంటే ఆయన రాజును కలుసుకోవాలని రాజధానికి వెళ్ళాడు.

రాజు నెవరు కలుసుకోవాలన్నా ముందు సమీరుడనే రాజోద్యోగిని కలుసుకోవాలి. వాడి దర్శనం అంత సులభం కాదు. ఇంటికాపలా వాళ్ళిద్దరికి రెండేసి వరహాల చొప్పున లంచమిచ్చి ఆయన, సమీరుడిని కలుసుకున్నాడు.

"రాజుతో నీకున్న పనేమిటి?" అని ప్రశ్నించాడు సమీరుడు.

"ప్రజలు నానా అవస్థలూ పడుతున్నప్పుడు రాజు వారిని ఆదుకోవాలి. మన రాజలాంటి పని చేయకపోగా పన్నులు పెంచుతున్నాడు. అదెంత తప్పో రాజుకర్థమయ్యేలా చెప్పాలి," అని జవాబిచ్చాడు కుముదుడు.

"రాజుకు అన్నీ తెలుసు. కానీ కోశాగారం వట్టిపోతే ఆయన మాత్రం ఏం చేస్తాడు?" అన్నాడు సమీరుడు.

"అది తెలుసుకున్నవాడే రాజవుతాడు! ఆయనకు తెలియకపోతే ఆ ఉపాయం నేను రాజుతో చెబుతాను," అన్నాడు కుముదుడు.

"ఆ ఉపాయమేదో నాకు చెప్పు. నేను రాజుకు చెబుతాను," అన్నాడు సమీరుడు.

అప్పుడు కుముదుడు గంభీరంగా, "అది కుదరదు! ఆ ఉపాయం రాజుకొక్కడికే తెలి

యాలి. నేనాయనను స్వయంగా కలుసుకుని మాట్లాడతాను," అన్నాడు.

"రాజదర్శనం కోసం అడ్డమైన వాళ్ళూ వస్తూంటారు. అలాంటివాళ్ళను ఆపడానికే నేనున్నాను. నువ్వు నాకు వంద వరహాలు ఇవ్వు. నేను నిన్ను బుల్లి మంత్రి దగ్గరకు పంపుతాను. ఆయన నిన్ను చిన్న మంత్రి వద్దకు పంపుతాడు. చిన్నమంత్రి నిన్ను పెద్ద మంత్రి దగ్గరకు పంపుతాడు. అందరినీ తృప్తి పరిచేలా ఎంతో కొంత ఇచ్చుకుంటేనే, నీకు రాజదర్శనమవుతుంది. అందరికంటే నేనే తక్కువ పుచ్చుకుంటాను," అన్నాడు సమీరుడు నిర్మొహమాటంగా.

రాజదర్శనం తనకు వల్లకాని పని అని అర్థమయ్యాక, కుముదుడు నిస్పృహ చెంది నగరం విడిచి అడవిదారి పట్టాడు. అక్కడ ఆయనకు ముని ఒకడు కనిపించి, "సమయానికి వచ్చావు! నేను హిమాలయాలకు పోతూ, నాదగ్గరున్న మహిమ గల ఉంగరం ఎవరికివ్వాలా అని ఆలోచిస్తున్నాను," అన్నాడు.

ఆ ఉంగరానికి తెల్లటి రాయి వుంది. అవినీతిపరుడు తటస్థపడితే, ఆ ఉంగరం రాయి నీలంగా మారుతుంది. ఆ ఉంగరం ధరించినవాడు పంచాక్షరీ మంత్రాన్ని ముమ్మారు జపించి ఏమి కోరుకుంటే అది జరుగుతుంది.

కుముదుడు, ముని నుంచి ఆ ఉంగరం తీసుకుని వేలికి పెట్టుకుని, ఆయనకు పాదాభివందనం చేసి సెలవు తీసుకున్నాడు.

ఉంగరం మహిమతో కుముదుడువెంటనే చంద్రావతీ నగరానికి వెళ్ళి, తనవాళ్ళను





కలుసుకుని, "మనం రాజధానికి వెళదాం. అక్కడ సుఖంగా జీవించవచ్చు," అని అందర్నీ బయల్దేరదీశాడు.

ఉంగరం మహిమవల్ల రాజధానిలో ఒక సంపన్నుడు, కుముదుడు తన ఇంట్లో వూరికే వుండడానికి అనుమతి ఇచ్చాడు.

రాజధానీ నగరం చాలా విశాలమైనది. కుముదుడక్కడ సామాన్యుల మధ్య తిరుగుతూ విచారించి అవినీతిపరులెవరో తెలుసుకున్నాడు. అలాంటివారు ఒకరు కాదు, ఇద్దరు కాదు, వేల సంఖ్యలో వుండడం ఆయనకు బాధ కలిగించింది.ముందుగా కుముదుడు నగరంలోని ప్రముఖ వ్యాపారి ఇంటికి వెళ్ళాడు. తన వేలి ఉంగరపు రాయి నీలంగా మారగానే, అతడు అవినీతిపరుడేనని రూఢి చేసుకుని, "నువ్వు మహాపాపివి! అందుకు పరిహారంగా ప్రతినెలా నాకు పదివేల వరహాలివ్వు. పాపం పోయి పుణ్యం వస్తుంది. లేదా తక్షణం నీకు కాళ్ళూ,చేతులూ చచ్చుబడిపోతాయి," అన్నాడు.

వ్యాపారి ఆయనకు డబ్బివ్వలేదు. కుముదుడు మనసులో పంచాక్షరీ మంత్రాన్ని ముమ్మారు జపించాడు. అంతే! వ్యాపారి వున్నవాడున్నట్లుగా కూలబడిపోయాడు. దాంతో హడలిపోయి అతడు కుముదుడికి డబ్బిచ్చే ఏర్పాటు చేశాడు.ఇలా కుముదుడు చాలా చోట్లకు వెళ్ళి, అవినీతిపరులను కలుసుకుని, వాళ్ళను బెదిరించి వారి వారి స్థోమతను బట్టి తనకు డబ్బు కట్టే ఏర్పాటు చేసుకున్నాడు.

ఇప్పుడు కుముదుడు అందమైన భవనంలోకి మారాడు. అవసరంలో వున్న పేదవారికి ధనధాన్యాలు దానంగా ఇస్తానని చాటింపు వేయడంతో, ప్రతిరోజూ ఆయన ఇంటి ముందు జనం తండోపతండాలుగా చేరేవారు.

సామాన్యుల్లో కుముదుడికి మంచి పేరు వచ్చింది. ఆరంభంలో అవినీతిపరులు భయపడినా క్రమంగా కొందరు ధైర్యం తెచ్చుకుని, రాజుకు ఆయన గురించి ఫిర్యాదు చేశారు. రాజు పెద్ద మంత్రికి చెప్పాడు. పెద్ద మంత్రి చిన్న మంత్రికి చెప్పాడు. అలా ఆ ఫిర్యాదు సమీరుడిని చేరుకుని, ఒకరోజున వాడు పదిమంది భటులను వెంటబెట్టుకుని కుముదుడింటికి వెళ్ళి సంజాయిషీ అడిగాడు.

"ముందు నీ పాపాలకు సంజాయిషీ చెప్పు!" అన్నాడు కుముదుడు.

"అయితే నిన్ను కారాగారంలో వేయక తప్పదు. అందుకే భటులను వెంటబెట్టుకు వచ్చాను," అన్నాడు సమీరుడు కళ్ళెర్రచేస్తూ.

"మంచి పని చేశావు! వెంటనే వాళ్ళను నీ ఇంటికి పంపి అయిదువేల వరహాలు తెప్పించు. ఆతర్వాత ప్రతి నెలా అలాగే డబ్బు పంపుతూండు. నీ పాపం నశించి పుణ్యం వస్తుంది," అంటూ పంచాక్షరిని ముమ్మారు మనసులో జపించాడు కుముదుడు.

అంతే! సమీరుడు కాళ్ళూ, చేతులూ చచ్చుబడి వున్న పళంగా కూలబడిపోయాడు. భటులు వెళ్ళి అయిదువేల వరహాలు తెచ్చి కుముదుడికి ఇచ్చినతర్వాతే, వాడు మామూలు మనిషి అయ్యాడు.

తర్వాత బుల్లి మంత్రి, చిన్న మంత్రి, పెద్ద మంత్రి కూడా కుముదుడి చేత భంగ పడి, పెద్ద మొత్తాలు నెలనెలా పాప పరిహారంగా ఇచ్చుకుంటూ రాసాగారు.

ఇది రాజుకు తెలిసింది. కుముదుడు సామాన్యుడు కాదని ఆయనకు అర్థమై తనే స్వయంగా కలుసుకుని మాట్లాడాలని బయలు దేరాడు.

రాజును చూస్తూనే కుముదుడాయనకు పాదాభివందనం చేశాడు. రాజు ఆశ్చర్యపడి, "నీ గురించి చాలా విన్నాను. నీకు నామీద గౌరవం వుందని మాత్రం తెలియదు!" అన్నాడు.



"నీకంటే పెద్దరాజునే అయినా నీతికి, అవినీతి పాదాభివందనం చేయక తప్పదు కదా!" అన్నాడు కుముదుడు.

"అంటే, నువ్వు అవినీతిపరుడివని ఒప్పు కున్నావు. తెలిసి కూడా ఎందుకు అవినీతికి పాల్పడుతున్నావు?" అని అడిగాడు రాజు.

"నేను పెద్ద రాజునని కూడా అన్నాను! నువ్వు అభ్యంతరపెట్టలేదు. అంటే, నేను నీకన్న పెద్దరాజునని ఒప్పుకున్నట్లే గదా!" అన్నాడు కుముదుడు.

"నేను సామాన్యపు రాజును. నీదగ్గర మంత్ర శక్తులున్నాయి. కాబట్టి నువ్వే పెద్ద రాజువని ఒప్పుకోక తప్పదు. ఏం చేసేది!" అన్నాడు రాజు.



"అంతా అబద్ధం! నా రాజ్యంలో అవినీతి పరులు లేరు. నువ్వే నారాజ్యంలో ఒక్కగానొక్క అవినీతిపరుడివి," అన్నాడు రాజు కోపంగా.

"నేనెలా అవినీతిపరుణ్ణి? అందరు ప్రజల డబ్బు మీద ఆధారపడ్డ నువ్వు చిన్నరాజువైతే, కొందరు అవినీతిపరుల డబ్బు మీద ఆధార పడ్డ నేను పెద్దరాజునయ్యాను. కాదేమో ఆలో చించు!" అన్నాడు కుముదుడు.

దానితో రాజుకు జ్ఞానోదయమయింది. ఆయనకు కుముదుడి ముందు తన తప్పొప్పు కుని, ఇకనుంచి వేయికళ్ళతో స్వార్థపరుల్నీ, అవినీతిపరుల్నీ కనిపెట్టి వుంటూ న్యాయ పాలన చెయ్యగలనని మాట ఇచ్చాడు.

కుముదుడు నవ్వి, "నువ్వు రాజవంశంలో పుట్టావు. అదే నిన్ను రాజును చేసింది. నువ్వెక్కిన సింహాసనం నీకు మంత్రశక్తుల నిచ్చింది. అందువల్లనే ప్రజలు నువ్వడిగిన పన్నులు కడుతున్నారు. మనిద్దరికీ తేడా లేదు," అన్నాడు.

"కోశాగారం వట్టిపోతే పన్నులు పెంచడం తప్పా? రాజు ప్రజలకు సాయపడాలంటే, ప్రజాధనం కావాలి గదా!" అన్నాడు రాజు.

"కోశాగారం ఎందుకు వట్టిపోతున్నది? రాజోద్యోగులు ప్రజాధనాన్ని దుర్వినియోగం చేస్తున్నారేమోనని ఎప్పుడైనా ఆలోచించావా? నీ అధికారుల్లో, వ్యాపారస్థుల్లో అవినీతి పెరిగి పోయింది," అన్నాడు కుముదుడు.

అప్పుడు కుముదుడు తన ఉంగరం గురించి చెప్పాడు. రాజు దాన్ని తనకివ్వమని కోరాడు. కుముదుడు ఇవ్వనిరాకరిస్తూ, "ఈ ఉంగరం ప్రస్తుతానికి నాదగ్గరా, నా తదనం తరం నా వారసులకూ చెందదనీ రాజా! నువ్వు ఇచ్చిన మాట మాత్రం మరవకు!" అంటూ హెచ్చరించి, ఇంటికి వెళుతూ దారిలో కనిపిం చిన సరస్సు మధ్యకు ఉంగరాన్ని విసిరివేశాడు.

బేతాళుడు ఈ కథ చెప్పి, "రాజా, ఎంతో మేధావీ, ప్రజల మేలు కోరేవాడూ అయిన కుముదుడి ప్రవర్తన అవివేకంగా లేదా? అసమర్థుడూ, ప్రజాకంటకుడూ అయిన రాజును తొలగించి తానే రాజయ్యే అవకాశాన్ని కుముదుడు ఎందుకు చేజేతులా జారవిడుచు కున్నట్టు? మహత్తు గల ఉంగరం తనదగ్గరా,

తన తదనంతరం తన వారసుల దగ్గరావుం టుందని రాజుకు చెప్పినవాడు, దారిలో దాన్ని సరస్సులోకి విసిరివెయ్యడం వెర్రితనం కాదా? ఉంగరాన్ని రాజుకిచ్చినా, ఆయన దాని సహా యంతో అవినీతిపరులనూ, దుండగులనూ అదుపులోపెట్టే అవకాశం వుండేది కదా? ఈ సందేహాలకు సమాధానం తెలిసికూడా చెప్పక పోయావో, నీ తల పగలిపోతుంది," అన్నాడు.

దానికి విక్రమార్కుడు, "కుముదుడు రాజధానికి బయలుదేరినప్పుడే గాక, ఆ తర్వాత ముని ద్వారా మహిమగల ఉంగరం లభించినప్పుడు కూడా, అతడికి తానే రాజు కావాలన్న కోరిక లేదు. అందువల్ల, రాజ పదవిని అతడే చేజేతులా జారవిడుచుకున్నా డన్న ప్రశ్నే తల ఎత్తదు. ఇకపోతే, రాజు కోరి నప్పుడు ఉంగరాన్ని అతడికివ్వకపోవడం ద్వారా, అతడు తను మేధావి మాత్రమేగాక, గొప్ప జ్ఞానినని కూడా రుజువు చేసుకున్నాడు. ఎలాగంటే — రాజైన వాడు తనకున్న అధి కార బలం ద్వారా, రాజనీతి చతురత ద్వారా రాజ్యపాలన చెయ్యాలి! అంతేకాని, మంత్ర తంత్ర శక్తులను ఆశ్రయించడం దుష్ఫలితా లకు దారితీస్తుంది. ఈ వాస్తవం కుముదుడు, తన మాటల ద్వారా రాజుకు సూచించాడు. ఉంగరం తన దగ్గరా, తర్వాత తన వంశం వాళ్ళ దగ్గరా వుంటుందని కుముదుడు రాజుతో అనడం, కేవలం రాజును, అతడి తర్వాత రాజులయ్యే వాళ్ళను — అంకుశం తమ దగ్గర వున్నదని భయపెట్టడానికి మాత్రమే! అంత శక్తి గల ఉంగరాన్ని అతడు సరస్సులో పారవేయడం, పదునైన అతడి తార్కిక దృష్టికి తార్కాణం. ఆ ఉం గరం తనతదనంతరం, తన వంశస్థుల హక్కు భుక్తాల్లోకి పోవడం జరిగితే, వాళ్ళల్లో ఏ ఒక స్వార్థపరుడైనా దాన్ని కిరాతకంగా ఉపయో గించి, రాజ్యాన్ని అల్లకల్లోలపరచగలడు. ఆ కారణం వల్లనే ఉంగరాన్ని కుముదుడు సరస్సులో పారవేశాడు," అన్నాడు.

రాజుకు ఈవిధంగా మౌనభంగం కలగ గానే, బేతాళుడు శవంతో సహా మాయమై, తిరిగి చెట్టెక్కాడు. — (కల్పితం)

[ఆధారం: "వసుంధర" రచన]



# రాకుమారి తెలివి

అవంతీ దేశపు రాకుమార్తె ఉమాసుందరి యుక్తవయస్కురాలయ్యే సరికి, ఒక్క యుద్ధవిద్యల్లోనే కాక శాస్త్ర, రాజ్యపాలన వంటి విషయాల్లో కూడా ప్రవీణురాలైంది. రాజు ఆమెకు అన్నిటా యోగ్యుడైన యువకుడితో వివాహం చేయదలచి, ఇరుగు పొరుగు రాజ్యాల రాకుమారులను ఆహ్వానించి, వాళ్ళ మధ్య పోటీలు ఏర్పాటు చేశాడు. ఈ పోటీలలో పుష్పదంతుడు, విక్రమవర్మ అనే వాళ్ళు అన్ని విద్యల్లోనూ సమానఉజ్జీలుగా మిగిలారు దీనితో రాజుకు పెద్ద చిక్కు వచ్చి పడింది.

ఆయన, కుమార్తెతో, "అమ్మా, జరిగింది చూశావుగదా! రేపు ఉదయం ఆ ఇద్దరు రాజకుమారుల పేర్లు చీటీలలో రాసి, మన కుటుంబ సభ్యులూ, మంత్రుల ముందు ఒక పాత్రలో వుంచుతాను. నువ్వు తీసిన చీటీలో ఎవరి పేరుంటే, అతడే నీకాబోయే భర్త," అని చెప్పాడు.

ఆ ఇద్దరు రాకుమారులలో విక్రమవర్మ అంటే, రాకుమారికి ఇష్టం. కాని, మిత్రుడి కొడుకు కావడంతో కూతుర్ని పుష్పదంతుడికే ఇవ్వాలని రాజు కోరిక. అందువల్ల రెండు చీటీలలోనూ పుష్పదంతుడి పేరే రాసి వుంచాడన్న నిజం, చెలికత్తె ద్వారా రాకుమారికి తెలిసింది.

మర్నాడు రాజు అందరి ఎదటా చీటీలున్న ఒకచిన్న బంగారు పాత్రను కూతురు ముందు పెట్టాడు. రాకుమారి అందులో నుంచి ఒక చీటీ తీసి తెరవకుండానే, "నాన్నగారూ ! కాబోయే భర్త పేరు చదవడానికి నాకు సిగ్గేస్తున్నది. కాబట్టి, పాత్రలో మిగిలిన చీటీ మీరు తీసి అందులోని పేరు చదవండి. అది కాక మిగిలిన రెండవ కుమారుడే గదా, నా భర్త!" అన్నది.

రెండవ చీటీలోనూ పుష్పదంతుడి పేరే వుండడంవల్ల, కూతురును విక్రమవర్మకిచ్చి పెళ్ళి జరిపించాడు రాజు, కూతురు తెలివికి ఆనందపడుతూ.

—బి. రఘురామరాజు



## చందమామ అనుబంధం - 67

## మన దేశపు చెట్లు




### రావిచెట్టు

సిద్ధార్థుడు బోధివృక్షం కింద కూర్చుని చాలా రోజులు ధ్యానంలో గడిపిన తరవాత ఆయనకు జ్ఞానోదయమయింది. బోధివృక్షం కింద జ్ఞానంపొందిన వాడు గనకే ఆయనకు 'బుద్ధుడు' అనే పేరు వచ్చింది. ఆ వృక్షం ఉన్న స్థలం 'బుద్ధగయ'గా ప్రసిద్ధి గాంచింది. అశోక చక్రవర్తి బౌద్ధమతం స్వీకరించాక, బౌద్ధమత ప్రచారం కోసం, కుమార్తె సంఘమిత్రను శ్రీలంకకు పంపాడు. ఆమె తన వెంట బుద్ధగయ నుంచి ఒక రావి కొమ్మను తీసుకుపోయి క్రీ.పూ. 288వ సం॥లో శ్రీలంక అనూరాధపురంలో నాటింది. దాదాపు 2,200 సం॥లకు పూర్వం నాటిన ఆ వృక్షం ఇప్పటికీ సజీవంగా ఉన్నది.

సంస్కృతంలో 'అశ్వత్థ వృక్షం' అని ప్రసిద్ధిగాంచిన రావిచెట్టును లాటిన్‌లో 'ఫికస్ రిలిజియొసాలిస్' అని అంటారు. దీనిని పవిత్రమైన చెట్టుగా భావిస్తారు. సాధారణంగా దేవాలయాలలోనూ, రచ్చబండలవద్దా రావిచెట్లను పెంచుతారు. రావిచెట్లను నాటిన వారికి పుణ్యం వస్తుందనే విశ్వాసం కూడా ఉన్నది. దీని వేళ్ళు భూమి లోపల చాలా దూరం పాకుతాయి. అయితే, సాధారణంగా ఈ చెట్లను గానీ, చెట్ల కొమ్మలను గానీ నరకడం అంటూ చేయరు.

రావి ఆకులు హృదయాకారంలో, దళసరిగా, మెత్తగా, నునుపుదేలి ఉంటాయి. ఆకు కొస సన్నటి తోకలాగావుంటుంది. మామూలుగా ఆకులు కిందికి వాలి ఉండడం వల్ల ఏమాత్రం గాలి వీచినా గల గల అనే శబ్దం వస్తుంది. వీటి పళ్ళను పక్షులు ఇష్టంగా తింటాయి. పక్షుల ద్వారా రావి విత్తనాలు చెల్లాచెదరుగా పడి పాడుబడిన గోడల మధ్యా, పెద్ద బండల మధ్యా కూడా రావి మొక్కలు మొలుస్తాయి.




# త్రిపిటకాలు

గౌతమ బుద్ధుడు జన్మించిందీ, బోధివృక్షం కింద ఆయనకు జ్ఞానోదయం కలిగిందీ, ఆయన తన భౌతిక దేహాన్ని త్యజించిందీ వైశాఖ పూర్ణిమనాడే. అందుకే వైశాఖ పూర్ణిమను బుద్ధపూర్ణిమ అని అంటారు. బుద్ధపూర్ణిమ ఈ నెలలో వస్తుంది.

జీవితం దుఃఖభాజనమైనది. కాబట్టి విజ్ఞులు జనన మరణ రహితమైన 'నిర్వాణం' కోసం ప్రయత్నించాలని గౌతమ బుద్ధుడు (క్రీ.పూ. 566 - 486) బోధించాడు. దుఃఖాలకు కారణం కోరికలనీ, ఆ కోరికలను వదులుకున్నట్టయితే, కర్మబంధం తొలగి 'నిర్వాణం' ప్రాప్తిస్తుందనీ ఆయన తన శిష్యులకు బోధించాడు. అయితే, ఆయన బోధనలు ఆయన కాలంలో లిఖితబద్ధం కాలేదు. ఆయన ప్రత్యక్ష శిష్యులు కూడా వాటిని అక్షర బద్ధం చేయడానికి పూనుకోలేదు. కానీ, బౌద్ధ పండితులు, బుద్ధుడి బోధనలను జ్ఞాపకం ఉంచుకుని శిష్యులకు బోధిస్తూ వచ్చారు. బుద్ధుడి మరణానంతరం రెండు వందల సంవత్సరాల తరవాత అశోక చక్రవర్తి బౌద్ధపండితులను పిలిపించి, వారిచేత బుద్ధుడి బోధనలను క్రమబద్ధం చేసి రాయించాడు. బుద్ధుడి బోధనలను వినయ పిటకం, సుత్త పిటకం, అభిధమ్మ పిటకం అని మూడు భాగాలుగా సంకలనం చేశారు. అందుకే వాటిని త్రిపిటకాలు అని అంటారు. 'పిటకం' అంటే గంప అని అర్థం.

ఆధ్యాత్మిక సంఘానికి అవసరమయ్యే నైతిక నియమాలను వినయ పిటకం తెలియజేస్తుంది. 'నిర్వాణం' లక్ష్యంగా గల వాళ్ళు ఆచరించవలసిన జీవిత విధానాన్ని సుత్త పిటకం, అభిధమ్మ పిటకం వివరిస్తాయి. ఈ మూడింటిలో 'సుత్త పిటకం' ప్రధానమైనది. దీనినుంచి గ్రహించిన 423 సూత్రాలే 'ధమ్మపదం' అనే గ్రంథంగా ప్రసిద్ధి గాంచింది.

త్రిపిటకాలు ఆనాడు వాడుకలో ఉన్న పాళీభాషలో రాయబడింది. ఇప్పుడది కొందరు పండితుల వరకే పరిమితమైన భాషగా మిగిలిపోయింది. త్రిపిటకాలలోని సూత్రాలు లయ బద్ధమైనవి. అవి గంభీర భావ గర్భితాలు. ఉదాహరణకు రెండు: "ద్వేషం ఎప్పుడూ ద్వేషంతో అంతం కాదు; అద్వేషంతోనే ద్వేషం అంతరిస్తుంది!"

"పూలవాసన, వీచే గాలికి ఎదురు నిలవజాలదు; కాని, నిజాయితీపరుడి పరిమళం (ప్రభావం) ఒడిదుడుకులకు ఎదురు నిలబడి దశదిశలా వ్యాపిస్తుంది!"

బౌద్ధ మతానికి త్రిపిటకాలు ప్రధానమైనవి. వాటితో పాటు బుద్ధ జాతక కథలు కూడా ముఖ్యమైనవే. ఇవి బుద్ధుడు పూర్వ జన్మలలో బోధిసత్త్వుడుగా వివిధ జన్మలను, ఒక్కొక్కసారి జంతు జన్మలను కూడా ఎత్తిన వైనాన్ని కథలుగా వివరిస్తాయి. ఇన్ని రకాల జన్మలెత్తడం ద్వారా భూమి మీది జీవితం ఎటువంటిదో అనుభవ పూర్వకంగా తెలుసుకునే అవకాశం ఆయనకు కలిగింది. బోధిసత్త్వుడు నీతి, నిజాయితీలకు ప్రతీకగా నిలిచి మానవులకు ఉత్తమ ధర్మాన్ని ఆచరించి చూపిన కథలను ఇవి వివరిస్తాయి.



# మీకు తెలుసా?

1. యూదుల రాజ్యాన్ని స్థాపించిన వారెవరు?
2. రెడ్‌క్రాస్ ఉద్యమ స్థాపకుడు ఎవరు?
3. దక్షిణ అమెరికాలోని 'బొలీవియా'కు ఆ పేరెలా వచ్చింది?
4. ప్రవక్త మహమ్మదు తరవాత వచ్చిన మొదటి ఖలీఫా ఎవరు?
5. 'క్వినైన్' అనే ఔషధాన్ని ఇచ్చే చెట్టు ఏది?
6. ఫిరంగులను మనదేశంలో మొట్టమొదట ఉపయోగించిన దురాక్రమణదారుడెవరు?
7. 1964వ సం॥లో నోబెల్ సాహిత్య బహుమతిని తిరస్కరించిన సుప్రసిద్ధ ఫ్రెంచి తత్వవేత్త ఎవరు?
8. భూమి గుండ్రంగా ఉన్నదన్న సిద్ధాంతాన్ని మొట్టమొదట ప్రతిపాదించిన వారెవరు?
9. చంద్రుడికి స్వయంప్రకాశం లేదని మొట్టమొదట ఒక గ్రీకు తత్వవేత్త చెప్పాడు. అయన ఎవరు?
10. అతి పెద్ద ఆఫ్రికన్ దేశం ఏది?
11. బౌద్ధమతంలోని రెండు ప్రధాన శాఖలు ఏవి?
12. అమెరికా అధ్యక్ష పదవిని ఒక నెల మాత్రమే నిర్వహించిన నాయకుడు ఎవరు?
13. యూరపులో ఒకదేశ రాజధాని ఇరవై దీవుల మీద ఉన్నది. దేశం ఏది? రాజధాని ఏది?
14. 15వ శతాబ్దంలో అచ్చుయంత్రాన్ని రూపొందించిన వారెవరు?
15. జపాన్‌లో 'లిఖిత రాజ్యాంగాన్ని' ప్రవేశపెట్టిన చక్రవర్తి ఎవరు?
16. ప్రపంచంలో మొట్టమొదటి మహిళా ప్రధాని ఎవరు?

# సమాధానాలు

1. అబ్రహామ్.
2. హెన్రీ డ్యూనాంట్.
3. 1825వ సం॥ స్పెయిన్ నుంచి దేశానికి స్వాతంత్ర్యం సాధించిన 'సైమన్ బొలీవర్' పేరు మీదుగా ఏర్పడింది.
4. అబూ బేకర్.
5. సింకోనా.
6. బాబర్.
7. జీన్‌పాల్ సార్త్రే.
8. పైథాగరస్.
9. అనాక్సాగొరాస్.
10. సూడాన్.
11. హీనయాన; మహాయాన.
12. విలియం హెన్రీ హారిసన్. (9వ అధ్యక్షుడు).
13. స్వీడన్; స్టాక్‌హోమ్.
14. జోహన్ గటెన్‌బర్గ్.
15. మైజీ చక్రవర్తి.
16. సిరిమావో బండారనాయకే. (శ్రీలంక).



# పెళ్ళిచూపులు

పనసపాడు గ్రామంలో, రామశాస్త్రి అనే సంపన్న పురోహితుడుండేవాడు. ఆయనకు పెళ్ళీడు కొచ్చిన కృష్ణశాస్త్రి అనే కొడుకున్నాడు. వాడు మంచి తెలివైనవాడుగా, ఆ గ్రామంలో పేరు తెచ్చుకున్నాడు. వాడికి సమ ఉజ్జీగా బుద్ధికుశలత కలిగిన అమ్మాయిని చూసి పెళ్ళి చెయ్యాలని ఆయన సంకల్పం. ఒకటి, రెండు సంబంధాలు చూశాడు. కాని, పైకి ఆ అమ్మాయిలు నదురుగా కనిపించినా, తెలివితేటల్లో వాళ్ళు తన కొడుక్కు దీటైన వారుగా రామశాస్త్రికి అనిపించలేదు.

ఇలా వుండగా— పొరుగు గ్రామమైన కంకిపాడులో పేరిశాస్త్రి కుమార్తె రాధ, కృష్ణశాస్త్రికి అన్నిటా సరిజోడీ అవుతుందని, కంకిపాడు నుంచి వచ్చిన రామశాస్త్రి బంధువొకడు ఆయనకు చెప్పాడు.

సరే, ఇదీ చూద్దామని రామశాస్త్రి, భార్యను, కొడుకును వెంటబెట్టుకుని బయలుదేరాడు. అరగంటలో గుర్రపు బండి కంకిపాడు చేరింది. ఇంటిముందు గుర్రపు బండి ఆగిన చప్పుడుకు, పేరిశాస్త్రి తలుపుతీసి చూశాడు. ఆయనకు బండి దిగుతూ రామశాస్త్రి కనిపించాడు.

వెంటనే పేరిశాస్త్రి బండిని సమీపించి, రామశాస్త్రికి నమస్కరించి, "మీ బంధువు వెంకటశాస్త్రి గారు, ఈ రోజు మీరు రానున్నట్టు చెప్పారు!" అంటూ సాదరంగా ఇంటిలోపలికి తీసుకుపోయాడు.

కాసేపటికి పేరిశాస్త్రి భార్య, రాధను చక్కగా అలంకరించి, అతిథులున్న గదిలోకి తీసుకు వచ్చింది. రాధ, రామశాస్త్రి దంపతులకు నమస్కరించి, చాప మీద తలవంచుకు కూర్చున్నది. ఆ అమ్మాయి సౌందర్యానికి, నమ్రతకు రామశాస్త్రి ఆనందించి, ఇక తెలివితేటల పరీక్షే మిగిలి వున్నది! అనుకున్నాడు మనసులో.

పేరిశాస్త్రి, రామశాస్త్రితో, "అయ్యా! నాకు ముగ్గురు కూతుళ్ళు, ఒక కొడుకు. పెద్దపిల్ల

రాఘవరాజు పట్టాభిరామరాజు

మీవాడు కోరిన రీతిలో పరీక్షించుకోవచ్చు," అన్నాడు పేరిశాస్త్రి, కూతుర్ని అపురూపంగా చూసుకుంటూ.

కృష్ణశాస్త్రి, తండ్రికనుసైగచేయగానే, మొదటి ప్రశ్నగా, "అద్దానికి ఆగర్భశత్రువు లెంతమంది వున్నారు, మీ ఇంట్లో?" అని ప్రశ్నించాడు రాధను.

రాధ మందహాసం చేసి, "నా చెల్లెళ్ళు, తమ్ముడు అంతా అద్దానికి ప్రాణస్నేహితులే! అద్దానికి శత్రువులెవరూ లేరు," అని జవాబిచ్చింది.

"మరి, నీ మాటేమిటి?" అన్నాడు కృష్ణశాస్త్రి.

"ముంజేతి కంకణాన్ని కూడా మీరు అద్దంలోనే చూసుకుంటారా?" అని ఎదురు ప్రశ్నించింది, రాధ.

"సరే! ముందు మిత్రులుగా వుండి, అద్దానికి శత్రువులుగా మారిన వాళ్ళెంతమంది వున్నారేమిటి, మీ ఇంట్లో?" అని అడిగాడు కృష్ణశాస్త్రి.

"అలా మారిన మా అమ్మమ్మ, ఈ మధ్యే చనిపోయింది!" అని బదులిచ్చింది రాధ.

"మీ గ్రామంలో కూడా నెలకొకసారి అమావాస్య వస్తుందా? లేక ఆ రాత్రి కూడా పున్నమేనా?" అని ప్రశ్నించాడు కృష్ణశాస్త్రి.

"మా గ్రామంలో అమావాస్య రాత్రికూడా పున్నమే! ఆ మాటకొస్తే, ఇంతవరకూ మా గ్రామంలో అమావాస్యను చూసిన వాళ్ళే లేరు," అన్నది రాధ.



రాధ. తక్కిన ముగ్గుర్నీ నిన్న వాళ్ళ మేనమామ వచ్చి పండగకు తన ఊరు తీసుకువెళ్ళాడు," అన్నాడు.

అప్పుడు రామశాస్త్రి, "అయ్యా! మీ అమ్మాయి రాధ బంగారపు బొమ్మలా వుంది. ఇక మిగిలింది అమ్మాయి తెలివితేటల పరీక్ష. మీకభ్యంతరం లేకుంటే, మీ అమ్మాయి తెలివితేటల్ని మావాడు కృష్ణశాస్త్రి పరీక్షిస్తాడు. ఈ పరీక్షలో అమ్మాయి నెగ్గిందంటే, ఇహ మా ఇంటి కోడలయినట్టే సుమండీ!" అన్నాడు.

"దానికెందుకండీ అభ్యంతరం? మా అమ్మాయి అందంలో రతీ దేవే కాదు, బుద్ధిజ్ఞానంలో సాక్షాత్తూ ఆ సరస్వతీదేవి. తినబోతూ రుచులెందుకులెండి! మా రాధ తెలివితేటల్ని

"అదిసరే! ఎండాకాలంలోకూడా మీ గ్రామ పొలాల్లో పిట్టలు వాలుతూంటాయా? లేక వర్షాకాలంలో మాత్రమేనా?" అని అడిగాడు కృష్ణశాస్త్రి.

"మా గ్రామ పంట పొలాల్లో, అన్ని ఋతువుల్లోనూ పిట్టలు వాలుతూనే వుంటాయి," అని బదులిచ్చింది, రాధ.

"బావుంది! మరి, ఆకాశమంత పందిరి, భూదేవి అంత పీటవేసి, మీ నాన్న మన పెళ్ళి జరిపించగలడా?" అని కృష్ణశాస్త్రి కొంటెగా ప్రశ్నించాడు. "అలా చేస్తే, మన పెళ్ళయ్యాక, మావాళ్ళకు ఆకాశమే ఇల్లవుతుంది!" అని జవాబిచ్చింది, రాధ.

ఇంతవరకూ ప్రశ్నా, జవాబులూ శ్రద్ధగా విన్న రామశాస్త్రి కల్పించుకుని, కొడుకుతో, "నువ్వేమీ ఇంక అడగక్కర్లేదురా! అమ్మాయి అందచందాల్తో పాటు తెలివితేటలు, సమయస్ఫూర్తి కలిగిందని తెలిసిపోయింది," అని, పేరిశాస్త్రితో, "అయ్యా! ఇక మీదే ఆలస్యం. పంచాంగంచూసి, త్వరలో మంచి ముహూర్తం నిర్ణయించండి," అన్నాడు, ఆనందంతో.

"అంతకంటే సంతోషం కలిగించేది మరేం వున్నది!" అన్నాడు పేరిశాస్త్రి పొంగిపోతూ.

తర్వాత పేరిశాస్త్రి దంపతులవద్ద సెలవు తీసుకుని, రామశాస్త్రి దంపతులు తమ కుమారుడితోపాటు గుర్రపుబండిలో కూర్చున్నారు.

బండి పనసపాడు గ్రామం దారిపట్టింది. బండి కొంచెం దూరం పోనిచ్చి రామశాస్త్రి



భార్య, "పెళ్ళి చూపుల్లో, మన అబ్బాయి వేసిన ప్రశ్నలు, ఆ అమ్మాయి ఇచ్చిన జవాబులు, నాకు ఒక్కటీ తలకెక్కలేదు!" అన్నది తనలో తను అనుకున్నట్టు.

ఇందుకు రామశాస్త్రి నవ్వి, "నీకు అర్థం కావని అప్పుడే ఊహించా. సరే, చెబుతావిను! మొదట్లో మనవాడు, మీ ఇంట్లో అద్దానికి ఆగర్భశత్రువు లెంతమంది? అని కదా అడిగింది. అంటే దానర్థం – పేరిశాస్త్రి గారింట్లో పుట్టుకతోనే అనాకార్లుగా పుట్టిన వారెంతమంది అని. దానికా అమ్మాయి తెలివిగా, తన ఇద్దరు చెల్లెళ్ళు, తమ్ముడు అంతా అద్దానికి ప్రాణ స్నేహితులే అని బదులిచ్చింది. అంటే, వాళ్ళు అందంగా వుంటారని అంతరార్థం. ముంజేతి

కంకణం వంటి తన అందానికి అద్దంతో అవసరం లేదని — తను అందగత్తెనని చెప్పక చెప్పింది మరొక ప్రశ్నకు సమాధానంగా.

అద్దానికి ముందు మిత్రులుగా వుండి, తర్వాత శత్రువులుగా మారడం అంటే, యవ్వనంలో సౌందర్యంతో మెరిసిపోతూ, అది పోయాక అద్దంలో తమ రూపాన్ని చూసుకోవడానికి ఇచ్ఛగించని వృద్ధులు, అనిభావం. అలాంటి వృద్ధురాలైన రాధ అమ్మమ్మ, కొన్నాళ్ళ కిందట చనిపోయినట్టు, జవాబిచ్చింది.

ఇక, కంకిపాడు గ్రామంలో నెలకొకసారి అమావాస్య వుంటుందా, లేక ఆ రాత్రి కూడా పున్నమిలా వుంటుందా? అన్న మనవాడి ప్రశ్నకు — అమావాస్య రాత్రి కూడా పున్నమిలా వుంటుందనీ, అసలు అమావాస్యను తమ గ్రామంలో చూసినవారే లేరనీ చెప్పింది. అంటే, వీధి దీపాల సౌకర్యం గ్రామంలో బాగా వుండటంవల్ల, తమకు చీకటి భయం లేదని చెప్పింది.

పోతే, ఎండా కాలంలో కూడా పొలాల్లో పిట్టలెప్పుడు వుంటాయి? పొలాల్లో ఏవో పంటలున్నప్పుడు! ఎండాకాలంలో కూడా ఎప్పుడు పొలాల్లో పంటలుంటాయి? గ్రామంలోని బావుల్లో, చెరువుల్లో సమృద్ధిగా నీరు వున్నప్పుడు, అంటే, వర్షాధారం పంటలేగాక, ఆ గ్రామంలో కరువుకాటకాలు లేకుండా మూడు కార్లూ పంటలు పండుతాయని — తమ గ్రామ పంట పొలాల్లో అన్ని ఋతువుల్లోనూ పిట్టలు వాలుతూనే వుంటాయని చెప్పడం ద్వారా తెలిపింది.

చివరి ప్రశ్నకు — ఆకాశ మంత పందిరి, భూదేవి అంత పీటవేసి దుబారా ఖర్చుతో పెళ్ళి జరిపిస్తే, తన తల్లిదండ్రులు ఇల్లు అమ్మవలసి వస్తుందనీ, అప్పుడు వాళ్ళకు ఆకాశమే ఇల్లవుతుందనీ చెప్పింది. దాని అర్థం, వాళ్ళు తన పెళ్ళి చేశాక ఏ చెట్టు కిందనో కాపరం చెయ్యవలసి రావచ్చని! ఇప్పటికైనా సర్వం బోధపడిందా? చూడుమరి, నీకాబోయే కోడలు ఎంత తెలివైనదో?" అన్నాడు.

అంతా విన్న రామశాస్త్రి భార్య, "వాళ్ళ సంభాషణలో గూఢార్థాలు దాగి వున్నాయా?" అన్నది అబ్బురపడుతూ.






## ఊపిరి బిగబట్టడంలో రికార్డు!

ఆక్సిజన్ లేకుండా, అంటే గాలి పీల్చుకోకుండా మనిషి ఎంతసేపు ఉండగలడో తెలుసుకోవడానికి స్వీడన్‌లోని జూఫిసియోలాజికల్ లాబొరేటరీ గత ఫిబ్రవరి నెల 25వ తేదీ ఒక ప్రయోగం జరిపింది. ఆ ప్రయోగంలో పాల్గొన్న పీటర్ హిర్వెల్ అనే 27 సం॥ల యువకుడు ముఖానికి ఎటువంటి పరికరమూ ధరించకుండా 6 నిమిషాలు 3 సెకనుల సేపు నీళ్ళ లోపల మునిగి ఉండి ఊపిరి బిగబట్టడంలో కొత్త రికార్డు సృష్టించాడు!

## ఉత్తర ధ్రువానికి ఒంటరి పయనం!




ఇంగ్లాండుకు చెందిన రూపెర్ట్ హాడో అనే 32 సం॥ల సాహస యువకుడు మార్చి 6వ తేదీ ఉత్తర ధ్రువానికి ఒంటరిగా కాలినడకన బయలుదేరాడు. దారిచూపడానికి, వెంట కుక్కలు గాని, వాహనం గాని, అఖరికి ఆక్సిజన్ కూడా లేకుండా అతడు బయలుదేరాడు. కెనడాలోని వార్డ్ హంట్ ద్వీపం నుంచి ఉత్తర ధ్రువానికి 1,100 కి.మీ. ఒంటరిగా నడిచి వెళ్ళడానికి అతడు పూనుకున్నాడు. అతడు విజయవంతంగా ఉత్తర ధ్రువం చేరుకున్నాడంటే అటువంటి సాహసం చేసిన వాళ్ళలో అతడే మొదటి వాడవుతాడు!

## గాలిపటాల ఉత్సవం

మార్చి ఆఖరి వారంలో థాయ్‌లాండ్‌లో 'అంతర్జాతీయ గాలిపటాల ఉత్సవం' ఏర్పాటయింది.



ఆ ఉత్సవంలో పన్నెండు దేశాలు పాల్గొన్నాయి. రాజధాని బ్యాంకాక్ ఆకాశంలో వివిధ ఆకారాలతో, పరిణామాలతో రంగురంగుల గాలిపటాలు ఎగిరాయి. జర్మనీ తరఫున ఎగురవేయబడిన 80 మీ॥ 'సెంటిపాడ్' గాలిపటం, జపాన్ 'వారియర్' గాలిపటం, 5 మీ॥ ఇండొనేషియా గాలిపటం, మలేసియా బంగారు రంగు గాలిపటం, నేపాల్ వెండి రంగు గాలిపటం, అమెరికా 'నో విండ్' గాలిపటం అందరి దృష్టినీ ఆకర్షించి అలరించాయి.



# మాతృప్రేమ

పూర్వం శ్రావస్తీనగరంలో సుపుత్రకుడని ఒక బుద్ధిమంతుడైన యువకుడుండేవాడు. తన తండ్రి పోయాక అతను తన తల్లిని ఎంతో భక్తిశ్రద్ధలతో సేవించుతూ, ఆమెను సుఖ పెడుతూ వచ్చాడు. అతని కాలమంతా తల్లి సేవలోనే గడిచిపోతూండటంవల్ల అతను ఏ ఉద్యోగమూ చేయలేదు. ఇది చూసి తల్లి, "నాయనా, ఇంటికైన మగవాడవు. నాకు అహోరాత్రాలు సేవ చేస్తూంటే ఎట్లా జరుగుతుంది? పెళ్ళిచేసుకో, నా ఉపచారాలు నీ భార్యే చేస్తుంది. నువ్వేదైనా పని చూసుకో వచ్చు," అన్నది.

తల్లిమాట కాదనలేక అతను పెళ్ళిచేసుకున్నాడు. అతని భార్య చాలా చక్కనిది. అతను ఆమెను ఎంతో ప్రేమగా చూడసాగాడు. అతని భార్య తన భర్తకు తల్లి మీద కూడా ప్రేమ ఉన్నట్టు తెలుసుకున్నది. "ఒకవంక తల్లిమీద ఇంత ప్రేమ ఉండికూడా నా భర్త నన్నింతగా ప్రేమస్తున్నాడుగదా, ఈ తల్లి లేకపోతే ఇంకా ఎంత ప్రేమిస్తాడో!" అనుకుని, ఆమె తల్లీ కొడుకుల మధ్య వైషమ్యాలు పెట్టటానికి నిశ్చయించింది. భర్తతో అత్తగారి మీద చాడీలు చెప్పింది. "మీ అమ్మకు నేనంటే ఏమీ పడదు. మీతో చెబితే నొచ్చుకుంటారని దాచి పెడుతున్నాను. ప్రతిదానికీ తప్పులెన్నుతుంది. భోజనం వేడిగా పెడితే వేడిగా పెట్టానంటుంది. చల్లగా పెడితే చల్లగా పెట్టానంటుంది. కాళ్ళు మెల్లిగా ఒత్తితే గట్టిగా ఒత్తమంటుంది. గట్టిగా ఒత్తితే చంపుతున్నానంటుంది. ఎంత ప్రయత్నించి కూడా ఆవిణ్ణి మెప్పించలేకపోతున్నాను," అని భర్త దగ్గిర కంటతడి పెట్టుకున్నది.

సుపుత్రకుడు తన భార్య మాటలు నమ్మాడు. తానూ, తనభార్యా సుఖంగా ఉండటంచూసి, ఓర్చలేనితనం చేత ముసలిది ఈ విధంగా తన భార్యను రాచి రంపాన పెడుతున్నదని అతనికి తోచింది. అందుచేత అతను

ఒకనాడు తల్లితో, "అమ్మా, నీకిక్కడ సుఖంగా లేనట్టున్నది. మరెక్కడికైనా, నీ ఇష్టం వచ్చిన చోటుకు వెళ్ళి ఉంటావా ఏమిటి?" అని అడిగాడు.

కోడలు చేసిన మోసం గ్రహించి, "అలాగే పోతాను, నాయనా!" అంటూ ముసలావిడ ఆ గ్రామంలోనే బంధువుల ఇంటికి పోయి, ఆ ఇంట్లో చాకిరిచేస్తూ, వాళ్ళు పెట్టినది తింటూ, సుఖానికి దూరమై కాలం వెళ్ళబుచ్చసాగింది.

అత్తగారు ఇంటినుంచి వెళ్ళిపోయిన కొంత కాలానికి కోడలు గర్భవతి అయి, తొమ్మిది నెలలూ మోసి ఒక మగపిల్లవాణ్ణి కన్నది. "మా అత్తగారు ఎటువంటి మనిషి అనుకోవాలి! ఆవిడ ఉన్నంతకాలమూ నాకు కడుపూ గడ్డలూ లేదు. ఆవిడ వెళ్ళగానే పండంటి పిల్లవాడు కలిగాడు!" అని ఆమె అమ్మలక్కలతో అన్నది.

ఈ మాటలు కొందరు నమ్మారు. మరి కొందరు తంపులమారివాళ్లు ముసలావిడ వద్దకు వెళ్లి, "చూశావా, మీ కోడలు ఏమంటున్నదో? నువ్వు అక్కడ ఉన్నన్నాళ్ళూ నీ కోడలికి పిల్లలే కలగలేదుట. నువ్వు వెళ్లిపోవటం చేత పిల్లవాణ్ణి కన్నదిట!" అని చెప్పారు.

ముసలావిడకు ఈ మాట వినగానే మండిపోయింది. "ఇంకేముందీ? ధర్మమే చచ్చింది! దానికి దినవారాలు పెడతాను!" అంటూ ఆవిడ ఇన్ని నీళ్ళూ, బియ్యమూ, నువ్వులూ కట్టుకుని శ్మశానానికి వెళ్లింది. అక్కడ పొయ్యి చేసి పిడతలో బియ్యం పోసి వండనారంభించింది.



ఆ సమయానికి అటుగా ఒక మునీశ్వరుడు వెళుతూ ముసలిదాన్ని చూసి, "ఏం, తల్లీ? ఎవరు పోయారు? ఎందుకీ శ్మశానంలో వంట చేస్తున్నావు?" అని అడిగాడు.

"నీకు తెలీదా, నాయనా? ధర్మం చచ్చింది. అందుకని దానికింత పిండం వేస్తున్నాను!" అన్నది ముసలావిడ.

"ధర్మం చావటమేమిటి? ఎవరన్నారు నీతో?" అని అడిగాడు మునీశ్వరుడు.

"ఎవరనాలి, నాయనా? అధర్మం విజృంభించటంలేదూ? నామీద నానా మాటలూ చెప్పి, నన్ను ఇంట్లోనుంచి వెళ్ళగొట్టించినాక నా కోడలు పండంటి పిల్లాణ్ణి కన్నదిగా? ధర్మం చావలా?" అన్నది ముసలావిడఎంతో కోపంగా.

మునీశ్వరుడు ఆవిడద్వారా జరిగినదంతా విని, "పెద్దదాన్ని నిన్ను కొడుకూ, కోడలూ ఇంత చేశారుగా? ఇప్పుడే వాళ్లను నా తపశ్శక్తితో భస్మీపటలం చేస్తాను, చూడు!" అంటూ ఆగ్రహంతో కమండలోదకం చేతులో పోసుకోబోయాడు.

వెంటనే ముసలావిడ అడ్డొచ్చి, "ఊరుకో, నాయనా, ఊరుకో! వాళ్ళు నన్ను అంటే అన్నారులే! వాళ్ళు కాస్తా పోతే నా మనవడు దిక్కులేని వాడై పోతాడు — నా బంగారు నాయన!" అన్నది.

కళ్ళ చూడనైనా చూడని మనవడిమీద ముసలావిడకు గల మమకారం చూసి నవ్వుకుంటూ మునీశ్వరుడు వెళ్ళిపోయాడు.

ఈలోపుగా, ఈవార్త ఊరంతా పాక్కింది. సుపుత్రకుడూ, అతని భార్యా, మరికొందరూ పరిగెత్తుకుంటూ శ్మశానానికి వచ్చారు.

"ఇదేం పని? రా అమ్మా, ఇంటికి పోదాం!" అన్నాడు కొడుకు.

తన ఆట కట్టినట్టు కోడలు గ్రహించింది. తన మోసం బయట పడుతుందని భయపడి, "బుద్ధి గడ్డితిని ఏమో అన్నాను. క్షమించు, అత్తయ్యా!" అని అత్త కాళ్ళ మీద పడింది.

ముసలావిడ మెత్తబడి, వాళ్ళతోపాటు వెళ్ళిపోయింది. ఆవిడ మనవణ్ణి చూసి ఆనందిస్తూ, జరిగినదంతా క్షణంలో మరిచిపోయి, సుఖంగా ఉన్నది.





# వీరహనుమాన్

రామనామ జపంతో హనుమంతుడు గంధ మాదన పర్వతం మీద తపస్సు చేస్తూండగా బ్రహ్మ వచ్చి, "హనుమా! కలియుగం ప్రవేశించబోతున్నది. కలి నీకు సరిపడదు. ఈ యుగాలకన్నింటికీ అతీతంగా ఉండే క్షీర సాగరానికి వెంటనే వెళ్ళు!" అని హెచ్చరించి వెళ్ళాడు.

క్షీరసాగరంలో శేష పానుపుపై పవళించి ఉండే విష్ణువు దగ్గర తుంబుర, నారదులు సదా సంగీతం వినిపిస్తూ ఉంటారు. నారదుడు మహతి వీణ మీటుతూ, గొప్ప భక్తి భావాలు గల కీర్తనలు పాడుతుంటాడు. తుంబురుడు అతడిపై పోటీపడుతూ, అప్పుడప్పుడు తన హయగ్రీవ వీణపై అద్భుతమైన మృదంగ ధ్వనులు కూడా తెప్పిస్తూ కట్టుదిట్టమైన శాస్త్రీయగానం తాళ ప్రధానంగా వినిపిస్తూంటాడు.

తుంబుర నారదులిద్దరూ, ఎవరికి వారు తానే గొప్ప సంగీతవేత్తననే గర్వంతో అసూయా ద్వేషాలు ప్రబలంగా పెంచుకుంటూ వచ్చారు. చీటికి మాటికి పోటీపడుతూ సంగీతం కట్టిపెట్టి, దూషణ ఛీత్కారాలతో వీణలను గదాయుధాలుగా ఎత్తి కొట్లాడుకోవడమే గాకుండా, "మాలో ఎవరు గొప్ప? మీరు చెప్పి తీరాలి," అని విష్ణువునే తరుచు వేధించసాగారు.

విష్ణువు వాళ్ళను సముదాయించలేక యోగనిద్రలోకి జారుకున్నప్పటికీ, ఇద్దరూ చెరో చెవి దగ్గరా నోళ్ళు పెట్టి పాడి, "మాలో ఎవరు గొప్పవాడో చెప్తావా? చెప్పవా? చెప్పే



బయలుదేరి గంధమాదన పర్వత ప్రాంతం చేరుకున్నారు. హనుమంతుడు ఏకధారగా చేస్తూన్న రామనామ జపం ఓంకారనాదంగా దూరం నుంచే వినిపించింది. తుంబుర నారదులు పర్వతం మీదకు వెళ్ళి, హనుమంతుడి సమీపంలో నిల్చున్నారు.

హనుమంతుడు కళ్ళు మూసి, రామనామాన్ని స్థాయి హెచ్చిస్తూ, తగ్గిస్తూ స్వరయుక్తంగా గానం చేస్తున్నట్లు జపిస్తున్నాడు. ఆ జపంలో రకరకాల రాగాలు వినిపిస్తున్నవి. ఆ రాగాల సమ్మేళనంలో అనేక భావాలు కలుగుతూన్నవి.

రా - మ అనే రెండు అక్షరాలే అనేక తాళ గతులతో లయ విన్యాసం చేస్తున్నాయి. తుంబుర నారదులు ఆ అపూర్వ గానానికి ఆశ్చర్యపోయారు. వచ్చిన పని మరిచారు. హనుమంతుడు గొప్ప నాదోపాసకుడని గ్రహించారు. సాహిత్యం కంటే, శాస్త్రం కంటే గాత్ర మాధుర్యం ఎంత గొప్పదో తెలుసుకున్నారు. వాళ్ళు కూడా పరవశించి హనుమంతుడితో కలిసి రామజపం చేశారు. హనుమంతుడి గంభీర మంద్ర గాత్రంతో, వాళ్ళ గొంతులు కలవక, అపశృతి కలిగి హనుమంతుడు కళ్ళు తెరిచాడు. ఒళ్ళు మరిచి కళ్ళు మూసి రామస్మరణ చేస్తున్న తుంబుర నారదులు అతడికి కనిపించారు.

హనుమంతుడు దిగ్గున లేచి వారి పాదాలు పట్టి కళ్ళకు అద్దుకున్నాడు.

వరకూ, వదిలేది లేదు," అని మరింత వేధిస్తూ వచ్చారు.

విష్ణువు విసిగిపోయి, "మీ సంగీతంతో నేను పరవశించిపోయి యోగనిద్రలో పడుతూ, లేస్తూ వుంటాను. కనుక నేను సరిగ్గా చెప్పలేను. గంధమాదన పర్వతం మీద ఒక కోతి ఉన్నది. రాముడు పిలుస్తున్నాడని చెప్పి, ఆ కోతిని ఇక్కడకు తీసుకురండి. ఆ కోతి ముందు మీ సంగీత సామర్థ్యం చూపండి. అది మీ గొప్పలు సరిగ్గా గుర్తించి చెప్పగలదు!" అని వాళ్ళను అక్కడినుంచి హనుమంతుడి దగ్గరికి పంపించాడు.

తుంబుర, నారదులు విస్తుబోయి, ఒకర్నొకరు కొరకొరా చూసుకుంటూ, వెంటనే

తుంబుర నారదులు తెప్పరిల్లి చప్పున కాళ్ళువెనక్కు లాక్కుని, "మహానుభావా! మా కాళ్ళు నువ్వు పట్టుకోవడమేమిటి? మేం ఎవరిమనుకున్నావో, తుంబుర నారదులం!" అన్నారు.

"మీరెవరైనా కావచ్చు. రామనామ స్మరణ చేస్తున్నవారంతా నాకు ఆరాధ్యులు. అటు వంటి వారి పాదధూళి నా శిరస్సున చల్లు కుంటాను, అది నాకు తృప్తి, ఆనందము, భాగ్యమూను!" అని హనుమంతుడు అన్నాడు ఎంతో భక్తిభావంతో.

హనుమంతుడు ఎంత గొప్ప గానకళా కోవిదుడో, భక్తితత్పరుడో గ్రహించి, తుంబుర నారదులు ఆశ్చర్యపోతూ, ఒకరి ముఖాలొకరు చూసుకున్నారు.

తరవాత తాము వచ్చిన పని గుర్తు తెచ్చుకొని, "హనుమంతుడా! రాముడు నిన్ను తీసుకురమ్మని మమ్మల్ని ఈ గంధమాదన పర్వతానికి పంపాడు. ఆయన క్షీరసాగరంలో శేషతల్పం మీద పవళించి ఉన్నాడు," అని తుంబురుడు అన్నాడు.

"సీత అతని పాదాలు ఒత్తుతూన్నది. లక్ష్మ ణుడు వేయి పడగల గొడుగు పడుతున్నాడు. భరత శత్రుఘ్నులు శంఖుచక్రాలుగా అతని భుజాల్ని అంటిపెట్టుకుని ఉన్నారు!" అని నారదుడు చెప్పాడు.

హనుమంతుడు వారివెంట అమితానం దంతో క్షీరసాగరం చేరుకున్నాడు.

గరుత్మంతుడు ఎదురువచ్చి స్వాగతం చెప్పి, ఆనందంతో హనుమంతుడి భుజాల





హనుమంతుడు, "రామ రామ, ఎంత మాట! నేను సంగీతవేత్తను కాను సరిగదా, సరిగమలు కూడా తెలియని కపిని, వాయు పుత్రుణ్ణి. నాది కేవలం గాలిపాట. మహా మహుల ముందు పాడే పాటి శక్తిమంతుణ్ణి కాదు," అన్నాడు.

"హనుమా! ఎప్పుడూ నీతో వచ్చిన చిక్కు ఇదే. నీశక్తి నీకు తెలియదు. నువ్వు సూర్యుడి దగ్గిర అన్ని శాస్త్రాలూ, కళలూ, నవ వ్యాకరణలూ క్షుణ్ణంగా నేర్చినవాడివి. ఎవరో ఒకరు నీ సత్తువ గురించి నీకు చెప్పేదాకా, నీ బలం నీకు తెలియదు, నీకు ఆవేశం రాదు. నేచెబుతున్నాను గదా, ఇహ పాడు!" అన్నాడు విష్ణువు.

మీద చేతులు వేసి, యోగక్షేమాలడుగుతూ, అతణ్ణి విష్ణువు దగ్గిరికి తీసుకెళ్ళాడు.

హనుమంతుడికి విష్ణువు రాముడిలాగే కనిపించాడు. విష్ణువే రాముడు; రాముడు విష్ణువు అవతారం అని గుర్తు తెచ్చుకుని హనుమంతుడు భక్తితో వంగి చేతులు జోడించాడు.

విష్ణువు హనుమంతుడితో, "హనుమంతుడా! తుంబుర నారదులు పాటలు పాడడంలో పోటీపడుతున్నారు. నువ్వు వాళ్ళ సంగీత పాండిత్యం పరీక్షించి తేలుస్తావని నిన్ను తీసుకురమ్మన్నాను. వారిని పరీక్షించే ముందు కాస్త నీ గానాన్ని మాకు వినిపించు!" అన్నాడు.

అప్పుడు హనుమంతుడు తన పేరు మొదటి 'హ' కారంతో 'హా' అంటూ మంద్ర గంభీర నాదంతో ప్రారంభించి విష్ణువుకు ప్రియమైన హిందోళ రాగ ఆలాపన అందుకున్నాడు.

తుంబుర నారదులు ఆ స్వర మాధుర్యానికీ, గాత్ర గాంభీర్యానికీ సంభ్రమాశ్చర్యాలు చెంది, నోళ్ళు తెరుచుకొని, చెవులు రిక్కించి వింటున్నారు.

హనుమంతుడు హిందోళ రాగాన్ని వైజయంతిగా మళ్లిస్తూ రామనామాన్ని అందుకున్నాడు. రామ అనే రెండక్షరాలతోనే స్థాయి భేదాలతో, ఎన్నెన్నో తాళ గతులతో అనేక రాగాలతో హనుమంతుడు పాడుతూంటే పాల

సముద్రం కెరటాలు నాట్యం చేశాయి. పాట వింటున్నవారి గుండెల్లో ఆనంద తరంగాలు పెల్లుబికాయి. తుంబుర నారదులకు ఎన్నడూ అనుభూతికి రాని భక్తిభావాలు స్ఫురించాయి. హనుమంతుడు తారస్థాయికి చేరుకున్నాడు. పాల సముద్రం కెరటాలు ఉవ్వెత్తున లేచి నక్షత్రాల్ని కప్పేశాయి. శేషుడి వెయ్యి పడగలు అల్లల్లాడాయి. హనుమంతుడు ఒక్కసారిగా మంద్ర స్థాయికి దిగి, దేవగాంధార రాగాన్ని అందుకున్నాడు.

శాంతరస ప్రధానమైన ఆ రాగానికి పాల సముద్రం క్రమక్రమంగా పేరుకొని గడ్డ కట్టుకుంది. తుంబుర నారదుల హయగ్రీవ, మహతి వీణలు జున్ను ముక్కల్లో పుడకల్లాగ అందులో ఉండిపోయాయి. క్షీర సాగరం మరింత గట్టిపడి పాలరతిలాగ తయారైంది. శేషుడు అందులో నొక్కుకుపోయి ఇబ్బంది పడ్డాడు.

విష్ణువు హనుమంతుడిని ఆగమని సంజ్ఞ చేశాడు. హఠాత్తుగా ఆగిపోయిన గానంతో తుంబుర నారదులు ఉలిక్కిపడి, పాలరాతి మంచుబండలా ఉన్న సముద్రంలో ఉండి పోయిన తమ వీణలను చూశారు.

"మీరు పాడి సముద్రాన్ని కరిగించి వీణలు తీసుకోండి!" అని విష్ణువు వాళ్ళను ఆజ్ఞా పించాడు.

నారదుడి భక్తిసాహిత్యం వల్లగాని, తుంబు రుడి పడికట్టురాళ్ళ సంగీత శాస్త్రంవల్ల గాని పాలరాతి బండ కొంచెమైనా మెత్తబడలేదు. కరగలేదు. తుంబుర నారదులు లోగడ పడ్డ





అమిత గర్వానికి సిగ్గుపడి తలలు దించు కున్నారు.

విష్ణువు ఆదేశం ప్రకారం హనుమంతుడు మళ్ళీ పాట అందుకున్నాడు. భూపాల, వసంత, జంఝూటి, దీపక మొదలైన రాగాలతో రామనామ గానం చేశాడు.

అప్పుడు రాగరాగిణులు రూపుదాల్చి నృత్యం చేశారు. హనుమంతుని గానం తార స్థాయికి చేరుకొని ప్రళయ ప్రకంపనం చేసింది. కైలాసం నుంచి శివుడు ఢమరుకం వాయిస్తూ తాండవం చేస్తూ వచ్చాడు. అతని వెనుక పార్వతి, గణపతి, ప్రమథ గణాలు వచ్చారు. బ్రహ్మ పద్మాసనం దిగి వచ్చాడు. అతనితో సరస్వతి వీణ వాయిస్తూ వచ్చింది. ఇంద్రాది దేవతలు వచ్చారు. పాల సముద్రం కెరటాలతో ఉయ్యాలలూగింది.

అప్పుడు క్షీరసాగరం ఒక పెద్ద కల్యాణ మంటపంలాగ కళకళలాడింది. నవ వధూ వరుల్లాగ లక్ష్మీ నారాయణులు కనిపించారు. సీతారాములకల్యాణం ఇలాగే జరిగి ఉంటుం దని హనుమంతుడు ఆనంద తన్మయత్వంలో మునిగిపోయాడు.

తుంబుర నారదులు వీణలు తీసుకు న్నారు. ఆదిశేషుడు పక్క సర్దుకున్నాడు.

అప్పుడు, "హనుమంతుడు పాడిన రీతి, హనుమద్గానం అని పేరొంది చిరకాలం వర్ధిల్లుతుంది, పండిత పామరులను సమా నంగా ఆకర్షించి, హృదయాన్ని ఆకట్టుకుం టుంది. అదే కళకు పరమావధి. నారదుడి సంగీతం భావ ప్రధానమైనది. తుంబురుడి సంగీతం తాళప్రధానమైనది భావాన్ని, తాళాన్ని సమన్వయపరిచేది రాగం. భావ రాగ తాళాలు మూడూ సమానమే అయినా, రాగం జీవం లాంటిది. రసాత్మకమైనది. మనస్సు మీద దాని ప్రభావం హెచ్చు. హనుమద్గానం రాగ ప్రధానమైనది కావటం వల్ల అది ఎప్పటికీ జనరంజకంగా ఉంటుంది!" అని సరస్వతీ దేవి తీర్పు చెప్పింది.

ఆ తరవాత, బ్రహ్మ ముందుకు వచ్చి, "హనుమంతుడా! నువ్వు ఏ కోరికా లేకుండా చేసినప్పటికీ, నీ తపస్సుకు విలువ కట్టగా బ్రహ్మపదవి కూడా చాలింది కాదు. కాని

అంతకు మించింది లేదు. నువ్వు కాబోయే బ్రహ్మవు! రామనామ జపంతో నీవు చేసిన తపస్సే నీవా పదవిని నిర్వహించక తప్పేది లేదని రాసిపెట్టింది. రానున్న కల్పంలో నీ వలన మానవ సృష్టి జరుగుతుంది!" అని చెప్పాడు.

అప్పుడు శివుడు ముందుకు వచ్చి, "హనుమా! ఈ బ్రహ్మదేవుడి సృష్టిలో మంచి వాళ్ళకంటే చెడ్డవాళ్ళే హెచ్చుగా పుట్టారు, పుడుతున్నారు, పుడతారు! తాను దేవుడిననే అహంకారం వల్ల, పరిపూర్ణ మానవత్వం మీద గురిలేకపోవడం వల్ల ఇలా జరిగింది. నీవు కోతివైనా, నీ ధ్యానంలో రాముడు ఉన్నందువల్ల నీ సృష్టిలో రాముడి వంటి పరిపూర్ణ మానవులు, సీత వంటి మానినులు, లక్ష్మణుడి వంటి ఆదర్శవంతులయిన సోదరులు నిండుగా వుంటారు! అంతవరకూ నీవు ఇక్కడే విష్ణు సాన్నిధ్యంలో ఉండు!" అని చెప్పాడు.

అప్పుడు బ్రహ్మ, "ఔను, హనుమా! శివుడు సరిగ్గా చెప్పాడు. ఎక్కువమంది మంచివారి మధ్య కొద్ది మంది దారితప్పిన వారున్నా వారిని దారికి తీసుకువచ్చే అవకాశం బాగా ఉంటుంది. అది సులభం కూడా. అది నీ సృష్టిలో జరిగి తీరుతుంది! రాబోతున్న బ్రహ్మకల్పంలో విష్ణువు బొడ్డు నుంచి సరికొత్త బ్రహ్మకమలం విచ్చుకుంటుంది. ఆ పద్మాసనాన్ని బ్రహ్మగా నీవు అలంకరిస్తావు. నీవు భవిష్యత్ బ్రహ్మదేవుడివి! సృష్టికర్తవు!" అని బ్రహ్మవాక్కుగా చెప్పాడు.

అందరూ హనుమంతుడిని మంగళ గానం వినిపించమని కోరారు.

హనుమంతుడు, "పవమాన సుతుడు బట్టు పాదార విందములకు, నిత్య జయ మంగళం!" అని శ్రీరాగంలో మంగళగానం చేశాడు.

హనుమంతుడు నారద తుంబుర గరుత్మంతులతో క్షీరసాగరంలో శేషతల్పశాయి యైన విష్ణువు సన్నిధానంలో, లక్ష్మీ నారాయణులను సీతారాములుగా సేవిస్తూ ఉంటున్నాడు. హనుమంతుడు చిరంజీవి; అతడు కాబోయే బ్రహ్మ! — (అయిపోయింది)





# జగడాల మొగుడు-కజ్జాల పెళ్ళాం

కమలాపురంలోని కనకయ్యకు, కనకమ్మకు పెళ్ళికుదిరినప్పుడు, "అతికినట్టుగాపేర్లుకుదిరిన ఈ మొగుడూ, పెళ్ళాలు ఎంత అన్యోన్యంగా వుంటారో కదా!" అనుకున్నారు, ఊళ్ళో జనం.

అయితే, పెళ్ళయి ఏడాది తిరక్కుండానే, వాళ్ళు జగడాల మొగుడు - కజ్జాల పెళ్ళాంగా పేరు తెచ్చుకున్నారు. ఇద్దరికీ క్షణం పడేది కాదు. ప్రతి చిన్న విషయానికీ పెద్దగా అరుచుకుంటూ రచ్చచేసుకునేవారు.

ఒక రోజు రాత్రి పిల్లికూన అరుపుతో నిద్రాభంగ మయింది, కనకయ్యకు. ఆ పిల్లికూన ఏ కిటికీలోంచి లోపలికి దూకిందో కానీ, వాళ్ళమంచంకిందేకూర్చుని, "మ్యావ్! మ్యావ్!" అంటూ అరవసాగింది.

కనకయ్య కోపంగా, "ఏమేవ్, కుంభకర్ణుడి ముద్దుల చెల్లెలా! రాత్రి పడుకునే ముందు అన్ని కిటికీల తలుపులూ మూయమంటే మూయవు కదా! ఆ పిల్లికూనను అవతలికి తోలు," అంటూ నిద్రలో వున్న పెళ్ళాన్ని ముసుగులాగి మరీ లేపాడు.

కనకమ్మ గట్టిగా ఆవులిస్తూ, "అర్ధ రాత్రి ఏమిటీ అంకమ్మ శివాలు? కావలిస్తే నువ్వే దాన్ని అవతలికి తోలు. దాని అరుపుకే చెడే నిద్ర కాదు నాది," అన్నది ముఖం మీదికి దుప్పటి లాక్కుంటూ.

ఇక ఆమెతో లాభం లేదని, నిద్రకళ్ళతోనే మంచం దిగి, గోడకు ఆనించి వున్న కర్రను చేతిలోకి తీసుకున్నాడు, కనకయ్య. పిల్లికూన పడక గదిలోంచి మధ్య గదిలోకి, అక్కడి నుంచి ముందు గదిలోకి కనకయ్యను పరిగెత్తించింది.

కనకయ్య ముందు గదిలోకి వస్తూనే, మళ్ళీ పిల్లికూన లోపలికి వెళ్ళకుండా ఆ గది తలుపు మూశాడు. తర్వాత వీధి తలుపు తీసి పిల్లికూనను అదిలించాడు. పిల్లికూన మ్యావ్ అని అరుస్తూ చీకట్లోకి పారిపోయింది.

మాచిరాజు కామేశ్వరరావు



స్థిమితపడి, "తాడంతా నన్ను కట్టడానికే సరిపెట్టకండి. అవతల గదిలో నా పెళ్ళాం వున్నది. దానిది కాస్త బొద్దు శరీరం!" అన్నాడు.

"నేను ఆడవాళ్ళను కంటి చూపుతోనే కసిరి కట్టేయగలను!" అంటూ ఎర్రటి కళ్ళున్న నల్లదొంగ పెద్దగా నవ్వాడు.

ఇంతలో పిల్లికళ్ళ తెల్లదొంగ వీధితలుపు గడియ పెడుతూంటే, నల్లదొంగ కనకమ్మ వున్న గదిలోకి వెళ్ళాడు.

అలికిడి విని కనకమ్మ పక్క మీద కదులుతూ, "నువ్వెక్కడి మగాడివయ్యా! పిల్లి కూనను అవతలికి తోలడానికి పులితోయుద్ధం చేసినంత సేపా?" అన్నది, గదిలోకి వచ్చింది కనకయ్య అనుకుని.

"నీ మొగుడి వైభోగం కళ్ళారా చూద్దువు గాని, నోరు మూసుకు నాతో రా!" అంటూ కనకమ్మ మెడమీద దుడ్డుకర్ర ఆనించాడు నల్లదొంగ.

దానితో కనకమ్మకు నిద్ర మత్తు వదిలి పోయింది. ఆమె దొంగ వెనకగా వచ్చి, స్తంభానికి కట్టివున్న కనకయ్యను చూస్తూనే కడుపు చెక్కలయ్యేలా నవ్వి, "ఆహాఁ, ఎంత కాలంగా నోనేను చేయాలనుకున్న పని!" అన్నది.

ఇది విని దొంగలు తెల్లబోయారు. ఆ మొగుడూ, పెళ్ళాలకు బొత్తిగా పడదనీ, ఇక తాము వచ్చిన పని చాలా సులువనీ వాళ్ళను కున్నారు.

విజయం తనదే అనుకుంటూ కనకయ్య వీధి తలుపు మూయబోతూంటే, నిలువెత్తు దొంగలిద్దరు, "ఆ పిల్లికూనను కిటికీలోంచి లోపలికి పంపకం చేసింది మేమే! దాన్ని బయటకు తోలడానికి వీధి తలుపో, పెరటి తలుపో తీస్తావని, మాకు తెలుసు," అంటూ దుడ్డు కర్రలతో లోపలికి ప్రవేశించారు.

కనకయ్య నిలువెల్లా వణికిపోతూ ఏదో అనబోయాడు. కాని, దొంగల్లో ఒకడు దుడ్డు కర్ర ఝుళిపిస్తూ, "నోరెత్తకు! అసలే మేం మంచి వాళ్ళం కాదు!" అన్నాడు.

తర్వాత వాళ్ళు, కనకయ్యను ముందు గదిలో వున్న స్తంభానికి వెంటతెచ్చిన తాడుతో కట్టివేయ సాగారు. ఆ సరికి కనకయ్య కాస్త

నల్లదొంగ, ఆమెతో, "ఇక నోరు మూసుకుని, ఇంట్లో వున్న ఖరీదైన వస్తువులన్నీ మూటకట్టు!" అన్నాడు కఠినంగా.

"అయ్యో ఖర్మ! రేకు డబ్బాలు, సత్తు పళ్ళాలు తప్ప, ఇంట్లో ఏమున్నవి? నా మొగుడు నిన్ననే జీతం డబ్బు మూట గట్టి తెచ్చి తల కింద పెట్టుకుని పడుకున్నాడు. పెళ్ళయి నాలుగేళ్ళయినా, జీతంరాళ్ళెన్నో చెప్పని పీనాసి! ఆమూటతెచ్చుకుని, డబ్బుఎంతుందో నాకు చెప్పండి, నల్లదొంగ గారూ!" అన్నది కనకమ్మ.

"జీతం డబ్బంతా దొంగలపాలు చేస్తావా? ఈ నెలంతా పస్తుపడుకుంటే రోగం కుదురుతుందిలే!" అంటూ పళ్ళు నూరాడు కనకయ్య.

"పస్తు పడుకునే ఖర్మ నాకేం పట్టలేదు. మళ్ళీ జీతం వచ్చేదాకా పుట్టింట్లో దర్జాగా గడిపి వస్తాను," అన్నది కనకమ్మ గొప్పగా.

నల్లదొంగ, కనకయ్య తల దిండుకింది నుంచి డబ్బు సంచీ తీసుకువచ్చి, "ఇప్పుడు సమయం అట్టేలేదు. డబ్బెంత వుందో మహారణ్యంలోని, మా చీకటి కొండ గుహలో లెక్క పెట్టి, వచ్చే అమావాస్యకు ఇక్కడికి వచ్చి నీతో చెబుతాలే, చెల్లెమ్మా!" అంటూ పెద్దగా నవ్వాడు.

"దానిదేముందిలే, అన్నయ్యా! వచ్చే అమావాస్య కాకపోతే, ఆపై అమావాస్య. సరే, చూడూ! ఉంగరం లేక నీ వేళ్ళు బోసిగా



కనబడుతున్నవి. ఈయన వేలికి మా పుట్టింటి వాళ్ళు పెట్టిన పగడపు ఉంగరం వుంది. ఎప్పుడూ వాళ్ళను ఆడిపోసుకునే మనిషికి, వాళ్ళిచ్చిన ఉంగరంతో పనేమిటి? నువ్వు తీసుకో!" అన్నది కనకమ్మ.

ఆ వెంటనే నల్లదొంగ, కనకయ్య వేలి ఉంగరాన్ని ఊడబెరుక్కున్నాడు.

కనకయ్య ఉక్రోషంతో వూగిపోతూ, "అయ్యా, తెల్లదొంగగారూ! దొంగల భయం కొద్దీ నా పెళ్ళాం నగలన్నీ ఒక పెట్టెలో పెట్టి, పెరటి బావిలో దాచింది. ఏ పండగ పబ్బం వచ్చినా, చీకట్లో బావిలోకి దిగి, ఆ పెట్టె పైకి తీసుకురావడం, పనయ్యాక మళ్ళీ భద్రంగా బావిలోకి జారవిడవడం – ఈ బండచాకిరీ



అంతా దీన్ని కట్టుకున్నందుకు నే చెయ్యలేక చస్తున్నాను. బాబ్బాబు, ఆ నగల పెట్టెను పట్టుకుపో!" అని చెప్పాడు.

కనకమ్మ గొల్లుమంటూ, "పెళ్ళయి ఇన్నేళ్ళయినా నువ్వు వీసమెత్తు బంగారం కొన్న పాపాన పోలేదు! నా బంగారమంతా ఎత్తుకెళ్ళమనడానికినువ్వెవడివి?"అంటూ రాగాలు ప్రారంభించింది.

"మర్యాదగా పెరట్లో బావి దగ్గిరకు పద!" అంటూ తెల్లదొంగ కర్ర ఎత్తి బెదిరించాడు.

"అలా దారిలో పెట్టు!" అంటూ నవ్వాడు, కనకయ్య.

"మనం పెరట్లోకి వెళ్ళగానే, ఆయన కేకలు పెడితే, మీ పనేం గాను? నోట్లో గుడ్డలు కుక్కండి," అంటూ కనకమ్మ, అందుబాటులో వున్న తుండుగుడ్డను నల్లదొంగ చేతికిచ్చింది.

కనకయ్య కోపంగా ఏదో అనేలోపల, తుండుగుడ్డను అతడి నోట్లోకుక్కేశాడు, నల్లదొంగ.

తెల్లదొంగ బావిగట్టునే బాల్చీ వున్నతాడు విప్పి, ఒక కొసను గిలకకు పక్కనే చెక్కకు గట్టిగా కట్టి, మరొక కొస పట్టుకుని బావిలోకి దిగాడు.

కనకమ్మ పొంగివస్తున్న దుఃఖాన్ని ఆపుకుంటూ, "పరమ దుర్మార్గుడు! మా అమ్మ పెట్టిన నగల ఆచూకీ చెప్పేశాడు. నేను మాత్రం తక్కువ తిన్నానా? నా మొగుడి తల్లి కాశీ యాత్రకు వెళుతూ, తన నగలన్నీ – పచ్చలు తాపిన వడ్డాణంతో సహా రేకు పెట్టెలో పెట్టి, సామానుల గదిలో అటకమీద దాచింది. ఆ నగలు విడిచి పెట్టేవు సుమా!" అన్నది నల్లదొంగతో.

అప్పటికే తొలికోడి కూయడంతో, "నాకు ఆ గది చూపించు!" అని, తొందరచేస్తూ కనకమ్మ వెంట ఇంటిలోపలికి వచ్చాడు నల్లదొంగ.

వాడు పాత సామానుల గదిలోని అటక ఎక్కగానే, ఠపీమంటూ ఆ గది తలుపులు మూసేసింది, కనకమ్మ.

తర్వాత, ఆమె తాపీగా కనకయ్య కట్లు విప్పి నోట్లోని తుండుగుడ్డ లాగి, "ఇద్దరు దొంగలూ దొరికారు! ఇక బారెడు పొద్దెక్కే

దాకా మనం నిశ్చింతగా నిద్రపోవచ్చు!" అన్నది.

"ఎక్కడున్నారు వాళ్ళు?" అని ఆత్రంగా అడిగాడు, కనకయ్య.

"ఒక చచ్చువెధవ పాతాళంలో, మరొకడు ఆకాశంలో!" అన్నది కనకమ్మ.

"ఇదే నీతో వచ్చిన చిక్కు. ఏసంగతీ విడమర్చి చెప్పవు," అని కస్సుమన్నాడు, కనకయ్య.

ఒకడు బావిలోనూ, మరొకడు అటక మీదా వున్నట్టు చెప్పింది, కనకమ్మ.

"నీ తెలివి తెల్లారినట్టుంది! ఆ తెల్ల దొంగ, ఈ సరికి బావిలోంచి బయటపడి వుంటాడు," అన్నాడు కనకయ్య.

"నేను సామానుల గదిలోకి, నల్లదొంగను బయలుదేరదీసే ముందే, తెల్లదొంగ గిలకకు పక్కన చెక్కకు కట్టిన తాడు ముడి ఊడదీసేశాను," అన్నది కనకమ్మ నవ్వుతూ.

ఆ తర్వాత,తెల్లవారే సమయాన కనకయ్య వెళ్ళి, గ్రామపెద్దకు సంగతి చెప్పాడు.

ఆయన కాపలా వాళ్ళతో వచ్చి, దొంగలను పట్టుకున్నాడు. కనకయ్యా, కనకమ్మా దొంగల దగ్గర వున్న తమ డబ్బూ, ఉంగరం లాక్కున్నారు.

ఆ ఇద్దరూ పేరు మోసిన గజదొంగలు. వాళ్ళను పట్టిచ్చిన వాళ్ళకు, ఆ ప్రాంతం జమీందారు చాలా పెద్ద మొత్తంలో బహుమానం ఇస్తానని లోగడ చాటింపు వేయించాడు.

"బహుమానం నాదే! లేని నగలు బావిలో వున్నట్టుగా నాటకమాడి, దొంగల ఆట కట్టించిందినేను, బహుమతి నాకే దక్కాలి," అంటూ పెళ్ళాంతో వాదనకు దిగాడు, కనకయ్య.

"పెళ్ళినాటికే లేని అత్తనూ, ఆవిడ నగలనూ సృష్టించి – ఒక చిన్న కట్టుకథతో నల్లదొంగను అటక మీదా, తెల్లదొంగను బావిలోనూబంధించింది నేను. బహుమతి నాకే దక్కాలి," అంటూ పోట్లాటకు దిగింది కనకమ్మ.

"మీరిలా కొట్లాడుకుంటూనే గొప్ప ఘన కార్యం చేశారు! కలిసిమెలిసి వుంటే, మీకిక ఎదురే లేదు," అని గ్రామపెద్దా, ఊళ్ళోవాళ్ళూ వాళ్ళను మెచ్చుకుని, జమీందారు బహుమతి డబ్బు పంపగానే ఘనంగా సన్మానించి, డబ్బును వాళ్ళిద్దరికీ సమంగా పంచారు.





# రాగయ్య శ్రోతలు

రాగయ్య అనే వాడికి పాటలు పాడాలనీ, అది అందరూ వినాలనీ మనసు. కానీ వాడు పాట పాడితే పెద్దవాళ్ళు తిట్టేవారు. చిన్నవాళ్ళు ఏడ్చే వారు. వాడి వయసువాళ్ళు పారిపోయేవారు.

రాగయ్యకు ఒకబామ్మ వుంది. ఆవిడ చాలా బాగా పాడుతుంది. రాగయ్య తనకు పాటలు నేర్పమని ఆవిడ నడిగాడు. "నువ్వు బాగానే పాడతావు గదరా!" అంది బామ్మ.

"ఎవ్వరూ వినకపోయాక బాగా పాడి ఏం లాభం? నువ్వు పాడితే అందరూ వింటారు గదా, అలాగే నా పాటకూడా అందరూ వినాలి," అన్నాడు రాగయ్య.

"చిన్నప్పుడు నా పాటా ఎవ్వరూ వినేవారు కాదు. ఇప్పుడు పెద్దదాన్నయ్యాకదా, అందు కని ఆ గౌరవంతో ఎవ్వరూ ఏమీ అనకుండా వింటున్నారు. నువ్వూ నాఅంత పెద్దయ్యేదాకా ఆగు. అప్పుడంతా నీ పాట వింటారు," అంది బామ్మ.

"అన్నాళ్ళాగలేను. నాకిప్పుడే నువ్వు పాటలు నేర్పాల్సిందే!" అన్నాడు రాగయ్య మంకుగా.

"ఒరే, నాకు పాడడమేకానీ నేర్పడం రాదు. నేను సంగీతం నేర్చుకోలేదు మరి! కావాలంటే నీకు వంటలు నేర్పుతాను," అంది బామ్మ.

"నేను పాట గురించి అడిగితే నువ్వు వంట అంటావేమిటీ?" అని చిరాకుపడ్డాడు రాగయ్య.

"నీ పాట నలుగురూ వినాలంటే, వచ్చిన వాళ్ళకు రకరకాల వంటలు రుచికరంగా చేసిపెట్టు. తిండి కోసమైతే ఎవరైనా రోజూ వస్తారు," అంది బామ్మ.

"ఆ మాత్రం దానికి నేనే వంటలు నేర్చు కోవాలా? వంట మనిషిని పెట్టుకుంటాను," అన్నాడు రాగయ్య.

బామ్మ వాడిని తిట్టింది. వంట మనిషి చాలా ఎక్కువగా డబ్బు తీసుకుంటాడు. అయినా ఒకసారికి, రెండుసార్లకి అయితే ఏమోకానీ,

శ్రీరామకమల్



జీవితంపొడుగునాపాడాలనుకుంటే స్వయంగా వంట చేయక తప్పదు కదా!

ఆ విధంగా పదహారేళ్ళ వయసులో బాగా వంట చేయడం నేర్చుకున్నాడు రాగయ్య. త్వరలోనే వాడికందులో మంచి ప్రావీణ్యత వచ్చేసింది.

"ఇక అందర్నీ పిలిచి పాట పాడి వినిపించి తిండి పెట్టనా?" అని అడిగాడు రాగయ్య, బామ్మనొకరోజున.

"అలా చేస్తే మీ నాన్న, నిన్నూ నన్నూ ఇంట్లోంచి గెంటేస్తాడు. ఇలాంటి విషయాల్లో సొంత సంపాదన వుండాలి. నువ్వు తినుబండారాలు చేసి అమ్ముతూండు. బోలెడు డబ్బొస్తుంది," అంది బామ్మ.

"నేను వంట నేర్చుకున్నది వ్యాపారం చేయడానిక్కాదు. నా పాటలు నలుగురికీ వినిపించడానికి," అన్నాడు రాగయ్య విసుగ్గా.

"అందుకే నేనూ చెబుతున్నాను. నువ్వు తినుబండారాలు చేసి అమ్మడం మొదలు పెడితే, నీ వంటలకు పేరొస్తుంది. అప్పుడంతా నీ పాటలు వినడానికి ఎగబడతారు. అర్థమైందా?" అని అడిగింది బామ్మ.

ఈ ఉపాయం రాగయ్యకు నచ్చింది. వాడు బామ్మ చెప్పినట్లే చేశాడు. మంచి లాభాలు వచ్చి, ఏడాది తిరక్కుండా మిఠాయి అంగడి నొకదాన్ని ఊళ్ళో తెరిచాడు.

రోజూ రాగయ్య కొందరిని తన ఇంటికి పిలిచి పాటలు పాడి వినిపించి, రుచికరమైన పదార్థాలు పెట్టేవాడు. మొదట్లో జనం ఉత్సాహంగా వచ్చేవారు. తర్వాత చాలామంది ఆలస్యంగా వచ్చి తిండి తిని వెళ్ళేవారు. ఎవరో ఒకరు వస్తే కానీ పాట మొదలు పెట్టడని, మొక్కుబడిగా ముందుగా కొందరు వెళ్ళేవారు. మిగతా వాళ్ళు సరిగ్గా తిండిసమయానికి వెళ్ళేవారు. అలా మరికొంత కాలం గడిచేసరికి రాగయ్య పాటలు వినే వాళ్ళంతా ఒక సంఘంగాఏర్పడి, రోజుకొక్కడు చొప్పున ముందుగా వెళ్ళడానికి నిర్ణయించుకున్నారు.

ఈ ఏర్పాటులో ఎవడి వంతువస్తే వాడు, బకాసురుడి వద్దకు వెళ్ళే ఏకచక్రపురవాసిలా, అడవిలో సింహం దగ్గరకు వెళుతున్న కుందేలులా దిగులుగా వుండేవారు. పోనీ అని



రాగయ్య బాగా నిరుత్సాహ పడిపోయాడు. అప్పుడు బామ్మ వాడితో, "నీ చేతిలో గొప్ప విద్య వుంది. ఎన్నాళ్ళని ఈ పల్లెటూళ్ళో పడి వుంటావు? పట్నంలో మిఠాయి అంగడి తెరిచావంటే రెండు చేతులా ఆర్జించవచ్చు. అక్కడ పనీ పాటలు లేని వాళ్ళు బోలెడు మంది వుంటారు. తిండి పెడతానంటే వాళ్ళు రోజూ నీ పాటలు వింటారు," అంది.

ఆ విధంగా రాగయ్య దుకాణం పట్నానికి మారింది. బామ్మ తనూ వాడితో పాటు పట్నానికి మకాం మార్చింది. రోజూ రాత్రిళ్ళు ఎవరో ఒకరు వాడి పాటలు వినడానికి వచ్చేవారు. త్వరలోనే ఇక్కడకూడా వంతుల వారీ ఏర్పాటు చేసుకున్నారు రాగయ్య శ్రోతలు.

మానుకుందామా అంటే, రాగయ్య వండిన పదార్థాలు చాలా రుచిగా వుంటాయిమరి!

తన శ్రోతలు చేసుకున్న ఈ ఏర్పాటు గురించి రాగయ్యకు తెలిసింది. వాడు నిరుత్సాహ పడితే బామ్మ ఓదార్చి, "ఎలాగో అలా నీ పాటలు వాళ్ళు వినాలి, అంతేకదా! రోజూ పాడడం మానేసి, వారానికొక్కసారి పాడు. అదీ దేవుడి భజన అని చెప్పు. దేవుడి పేరు చెబితే అంతా ముందే వస్తారు. చివర్లో ప్రసాదాలు పెట్టు. నీ కోరిక తీరుతుంది," అంది.

కొన్నాళ్ళీ ఉపాయం ఫలించింది. తర్వాత మామూలే! కారణ మడిగితే చాలామంది, తమకు దేవుడి మీద నమ్మకం లేదన్నారు. కొందరైతే గర్భు నాస్తికులమన్నారు.

దుకాణంలో రాగయ్యకు మధ్యాహ్నం పూట పెద్దగా రద్దీ వుండేది కాదు. బిచ్చగాడొకడు ఆ సమయంలో అక్కడే నిలబడి ఆశగా తినుబండారాల కేసి చూస్తూండేవాడు.

ఒక రోజున రాగయ్య వాడిని పిలిచి, "నా పాట వింటానంటే నీకు కడుపు నిండా తిండి పెడతాను," అన్నాడు.

బిచ్చగాడు సరేనన్నాడు. రాగయ్య తనకు నచ్చిన పాట ఒకటి పాడి వినిపించి, వాడికి కడుపునిండా తిండి పెట్టాడు.

తనకొక మంచి శ్రోత దొరికాడని రాగయ్య సంతోషించాడు. కానీ మర్నాడా బిచ్చగాడు రాకుండా మరొకడు వచ్చాడు. అయితే రాగయ్య పాత బిచ్చగాడికోసమే చూస్తూంటే,



కొత్త బిచ్చగాడు వాడిని సమీపించి, "తమరి అంగట్లో అన్నీ బాగున్నాయని వాడే నన్ను పంపాడు, బాబయ్యా! మీ పాట నేను వింటాను. నాకు తిండి పెట్టండి," అన్నాడు.

"మరి వాడెందుకు రాలేదు?" అన్నాడు రాగయ్య అనుమానంగా.

"అంగట్లో అన్నీ వున్నా అల్లుడి నోట్లో శని అని ఊరికే అనలేదు, బాబయ్యా! వాడికి కాస్త సంగీత జ్ఞానముంది. అందుకని తమ పాట వినడానికిబ్బంది పడుతున్నాడు. నాకే జ్ఞానమూ లేదు కాబట్టి ఏ ఇబ్బందీ లేదు," అన్నాడు కొత్త బిచ్చగాడు.

ఈ మాటలు వింటూనే అక్కడికొచ్చిన సరస్వతి కిసుక్కున నవ్వింది. రాగయ్య చిన్న బుచ్చుకుని, ఆమె వంక చూస్తూ, "ఎందుకు నవ్వుతావు?" అని అడిగాడు.

దానికి సరస్వతి సంశయిస్తూ, "నాకు వంట చేయడం చిరాకు. కానీ నేనాడపిల్లను కదా వంట నేర్చుకోక తప్పదంటాడు నాన్న. ఎవరైనా నీలాగా కూర్చోబెట్టి తిండి పెడతానంటే ఎన్ని పాటలైనా వింటాన్నేను. అందుకే నాకీ బిచ్చగాడి మాటలు నవ్వు తెప్పించాయి," అన్నది.

"నీకూ, సంగీత జ్ఞానం లేదా?" అన్నాడు కొత్త బిచ్చగాడు ఆశ్చర్యంగా.

"ఎందుకులేదు? మా నాన్న గొప్ప సంగీత విద్వాంసుడు. రోజూ బోలెడుమంది వచ్చి, ఆయన పాట విని వెళుతూంటారు. వచ్చిన వాళ్ళకు మంచి తిండి పెట్టలేక పోతున్నామని, మా నాన్న బాధ. నా వంట ఏమీ బాగుండదు. రోజూ ఈ విషయమై మా ఇంట్లో గొడవపడుతూంటాం," అంది సరస్వతి.

"అయితే నాపాట నువ్వసలు వినవు!" అన్నాడు రాగయ్య నిట్టూర్చి.

"వంటపని తప్పిందంటే ఉడుకు నీళ్ళలో కూర్చోగలను. మంచు ముక్కల మీద పడుకోగలను. నీ పాట నాకోలెక్కా! ఆడపిల్లలకు ఓర్పెక్కువ. ఒక ఇష్టం లేని పని తప్పించుకునేందుకు పది ఇష్టం లేని పనులు చేయగలరు," అంది సరస్వతి.

"అయితే రోజూ రాత్రి మీ ఇంటికొచ్చి నేను వంట చేసి పెడతాను. నువ్వు నా పాట

వింటావా?" అని అడిగాడు రాగయ్య ఉత్సాహంగా.

సరస్వతి సరేనన్నట్టు తలవూపగానే రాగయ్య, "అవునూ, పాట వినడానికొచ్చిన వాళ్ళకు తిండి పెట్టడమెందుకూ? లేకుంటే రారా?" అని అడిగాడు అనుమానంగా.

" ఆ వచ్చిన వాళ్ళు నాన్నకు విలువైన కానుకలిస్తారు. వాళ్ళకు ఎంతో కొంత తిండి పెట్టకపోతే బాగుండదు కదా!" అంది సరస్వతి.

ఇది వినగానే రాగయ్యకు తన శ్రోతలకూ, సరస్వతి తండ్రి శ్రోతలకూ వున్న తేడా అర్థమయింది. అయితే ఆ తేడా శ్రోతలలో కాదనీ తనలో వున్నదనీ మాత్రం వాడికి తోచలేదు.

రాగయ్య వెనక కాస్త చాటుగా నిలబడి, ఈ సంభాషణ అంతా విన్న బామ్మ, ముందుకొచ్చింది. ఆమె కంటబడగానే సరస్వతి ఎవరన్నట్టు, రాగయ్యకేసి చూసింది. రాగయ్య వెంటనే, "ఎరగవా? మా బామ్మ!" అన్నాడు.

సరస్వతి చిన్నగా నవ్వి, "అలాగా! నలభై ఏళ్ళకిందట సర్వేపల్లి సంతలో చూసిన గుర్తు," అంటూ అక్కడి నుంచి కదలబోయింది.

బామ్మ చప్పున వచ్చి సరస్వతి చేయి పట్టుకుని, "ఆగవే, అమ్మాయ్! చక్కదనాన్ని మించిన తెలివితేటలు గలదానివిలా కనబడుతున్నావు. మీ ఇల్లెక్కడ? మీ నాన్నగారితో మాట్లాడాలి," అన్నది.

సరస్వతి, బామ్మను తన ఇంటికి తీసుకుపోయింది. బామ్మ సరస్వతి తండ్రికి జరిగినదంతా చెప్పి, "మీ అమ్మాయి అంగీకారం ముందే తెలిసింది. మీరుకూడా అంగీకరిస్తే, సరస్వతిని మా మనవడికి చేసుకుంటాను. అన్నీ వున్నా, ఆడపిల్లకు వంట చేతకాకపోవడం అంటే అంగ వైకల్యంతో సమానం," అన్నది.

"మీరన్న మాట నిజమే. పెళ్ళికి నా అభ్యంతరం ఏమీలేదు. మా అమ్మాయికి వంట బాధ తప్పుతుంది. మీ వాడికి జీవితకాలం పాటు, తన పాట వినే శ్రోత దొరికినట్లవుతుంది," అన్నాడు సరస్వతి తండ్రి సంతోషంగా.

ఈ విధంగా సరస్వతి, రాగయ్యల సమస్య పరిష్కారమైపోయి, ఇద్దరూ పెళ్ళి చేసుకుని చాలాకాలం సుఖంగా కాపరం చేశారు.



# ప్రకృతి వింతలు

## ఉప్పు నిజం



సముద్రజలాలు ఎందుకు ఉప్పగా ఉంటాయి? ఈ ప్రశ్నకు సమాధానంగా — సముద్రంలో పెద్ద ఉప్పుల ఓడ మునిగిపోవడం నుంచి, సముద్రం మీది పగతో దానిని గాలీ, మేఘాలూ మధించడం వరకు రకరకాల వింత జానపద కథలు పుట్టుకొచ్చాయి. అయితే, అసలు కారణం అదేదీ కాదు. నదులు ఎక్కడెక్కడో పుట్టి, కొండల నుంచి ప్రవహిస్తూ తమతో రకరకాల లవణాలనూ, ఖనిజాలనూ తీసుకువెళ్ళి సముద్రంలో కలుస్తాయి. అక్కడ కొంత జలం ఆవిరి అయిపోయినప్పటికీ అడుగున వున్న లవణాలు చిక్కబడడం వల్ల నీళ్ళు ఉప్పగా తయారవుతాయి. సముద్రంనీళ్ళను చిన్న చిన్న కయ్యలలో నింపిఎండబెట్టి మామూలు ఉప్పు తయారుచేస్తారు.

## నీళ్ళు లేకుండా బతికే మొక్కలు!



మొక్కలు బతకడానికీ, పెరగడానికీ నీళ్ళు చాలా అవసరం అని అందరికీ తెలిసిందే. ఎడారిలో నీళ్ళుండవు గాని అక్కడ కూడా కొన్ని మొక్కలు ఉన్నాయి. వీటిని జెముళ్ళు అంటారు. ఇది ఎలా సాధ్యం? ఇతర మొక్కలకు లాగే వీటికీ నీళ్ళు అవసరమే. వీటికి ఆకులు లేవు. అయితే కాండాలలో నీళ్ళు నిలువ వుంచే సదుపాయం ఉన్నది. అందువల్ల ఎక్కువ కాలం వర్షాలు లేకపోయినా ఇవి బతకగలుగుతున్నాయి. వీటి వేళ్ళు కూడా భూమి లోపలికి పాకి, వర్షం కురిసినప్పుడు వీలయినంత ఎక్కువ నీటిని పీల్చుకుంటాయి. కావాలంటే మీరూ జెముళ్ళను కుండీలలో పెంచవచ్చు. తరచూ నీళ్ళు పోయకపోయినా ఫరవాలేదు కాని క్రమంగా పోశారంటే మాత్రం. — చకచకా ఏపుగా పెరిగి చూస్తూండగానే పువ్వులు కూడా పూస్తాయి.

## ఈకులు - ఈనెలు



ఆకులలోని ఈనెలు చూడడానికి ఎంతో అందంగా కనిపిస్తాయి. ఇవి కేవలం అందంగా ఉండడమే కాదు; మొక్కలకు మన శరీరంలోని రక్తనాళాల వంటివి. వేళ్ళు భూమి నుంచి పీల్చిన ద్రవరూపంలో వున్న ఖనిజ లవణాలనూ, ఇతర పోషక పదార్థాలనూ, ఈనెలు మొక్క వివిధ భాగాలకు తీసుకుపోతాయి. ఇవి ఆకుల కొనలను చేరేసరికి శాఖోపశాఖలుగా చీలుతాయి. ఈనెలు ఇలా ఆహార పదార్థాలను సరఫరా చేయడం వల్లే ఆకులు పచ్చగా కళకళలాడుతూ కనిపిస్తాయి.

Say "Hello" to text books and friends
'Cause School days are here again
Have a great year and all the best
From Wobbit, Coon and the rest!



# ఫోటో వ్యాఖ్యల పోటీ :: బహుమానం రు. 100/-

ఈ పోటీల వ్యాఖ్యలు 1994 జూలై నెల సంచికలో ప్రకటింపబడును.



M. Lakshmi



M. Lakshmi

*పై ఫోటోలకు సరియైన వ్యాఖ్యలు ఒక్క మాటలో గానీ, చిన్న వాక్యంలో గానీ కావాలి. (రెండు వ్యాఖ్యలకూ సంబంధం ఉండాలి.) * మే నెల15వ తేదీలోగా వ్యాఖ్యలు మాకు చేరాలి. * మాకు చేరిన వ్యాఖ్యలలో అత్యుత్తమంగా ఉన్న సెట్టుకు (రెండు వ్యాఖ్యలకు కలిపి) రు. 100/-లు బహుమానం. *వ్యాఖ్యలు రెండూ పోస్టు కార్డుపైన రాసి, ఈ అడ్రసుకు పంపాలి: చందమామ ఫోటో వ్యాఖ్యల పోటీ, మద్రాసు - 600 026.

## మార్చి నెల పోటీ ఫలితాలు

మొదటి ఫోటో : ఇంకా ఎందుకు పంతం? రెండవ ఫోటో : ఇవన్నీ నా సొంతం!

పంపినవారు : టి.వి. కల్యాణి, C/o టి.ఆర్. నాగభూషణం.

39, రవీంద్ర సరాని, రీజనల్ అగమార్క్ లాబొరేటరీ, కలకత్తా - 700 073.

బహుమతి మొత్తం రు. 100/- నెలాఖరులోగా పంపబడుతుంది.


## చందమామ

ఇండియాలో సంవత్సర చందా : రూ. 48.00

చందా పంపవలసిన చిరునామా :

డాల్టన్ ఏజన్సీస్, చందమామ బిల్డింగ్స్, వడపళని, మద్రాసు - 600 026

Printed by B.V. REDDI at Prasad Process Private Ltd., 188 N.S.K. Salai, Madras 600 026 (India) and Published by B. VISWANATHA REDDI on behalf of CHANDAMAMA PUBLICATIONS, Chandamama Buildings, Vadapalani, Madras 600 026 (India). Controlling Editor: NAGI REDDI.

